# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 4 | రాజమహేంద్రవరము 16-8-1979 | సంచికలు 18, 19, 20


—* ఈ సంచికలో *—



1—9—79 సంచికలో నవ్యకవితా యుగోదయశ్రీ – ఉదయశ్రీ, శ్రీ శ్రీ కవిత్వంలో హాస్యం, మన కర్ణుని కథ మొదలగునవి ఉంటాయి.


—* 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు 10-00.
అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై.

# 'ఏకవీర'లో ప్రతీకలు - ఒక పరిశీలన

— శ్రీ సుంకిరెడ్డి నారాయణ రెడ్డి



మానవుడు అనాదినుండి తన సౌఖ్యం కొఱకు పోరాటం సలుపుతూనే ఉన్నాడు. ఈ సౌఖ్యకాంక్ష ఒక్క లౌకిక జీవితంలోనే కాక అటు భాషలోనూ ఇటు సాహిత్యంలోనూ కన్పిస్తుంది. ఒక విషయాన్ని హృదయానికి హత్తుకునేటట్లు చెప్పడానికి వర్ణనతో కూడిన వివరణ చేసేబదులు ఆ విషయాన్నంతటినీ ఒకవస్తువులో గాని భావంలో గాని నిక్షిప్తం చేసి చెప్పడం అటు రచయితకు ఇటు పాఠకుడికి సౌఖ్యంగా ఉంటుంది. ఇవే ప్రతీకలుగా చెప్పవచ్చు.

విశ్వనాథ సత్యనారాయణ గారి నవల్లలో కెల్ల ఏకవీర నవలలో కళావిలువలు అధికంగా నిక్షిప్తమయినాయి. ఆ విలువల్లో ఒక భాగమే ఈ ప్రతీకలు.

ఈ నవలలో కుట్టాన్_మీనాక్షి; వీరభూపతి_ఏకవీరలు పరస్పరం గాఢంగా ప్రేమించుకుంటారు. కాని అనుకోకుండా కుట్టాన్ - ఏకవీరలకు, మీనాక్షి_వీరభూపతులకు వివాహం జరుగుతుంది. ఈ నలుగురి మానసిక సంఘర్షణా చిత్రణ ప్రధానంగా సాగుతుందీ నవల.

ఒకసారి వీరభూపతి ఇంటిలో కుట్టాన్, తను ప్రేమించిన మీనాక్షిని వీరభూపతి వివాహముచేసికొన్న వార్తని దిగ్భ్రమ చెంది పడబోయి ఇంటికి ప్రయలుదేరుతాడు. "ఎదురుగా కమ్మరివాని కొలిమిలోఁ బండఁగ్రాగిన ఇనుపగుండువలె సూర్యోదయ మయినది." తను గాఢంగా ప్రేమించిన స్త్రీని తనకు అత్యంత ప్రియమిత్రుడైన వీరభూపతి చేసికొన్న వార్త విన్న హృదయంలో ఎంత సంఘర్షణ జరుగుతుందో వేరే చెప్పని లేదు. ఆ సంఘర్షణా ప్రజ్వలనాన్ని తించడానికి ఎంతవర్ణనైనా చేయవచ్చు కాని, ఉదయిస్తున్న ఒక్క సూర్యుడిని ప్రతీకగా చేసికొని చెప్పఁదలచిన భావానికి ఏలోపం రాకుండా వాచ్యం కాకుండా చెప్పడం జరిగింది. అందుకే "భావ ప్రకటనకు వాతావరణ కల్పనకు తోడ్పడే శబ్దాలు ప్రతీకలు" అంటాడు ప్రఖ్యాత ఫ్రెంచి ప్రతీక కవి మలార్మే. తర్వాత ఈ ప్రతీకలోని భావాన్ని వీరభూపతితో కుట్టాన్ వాచ్యంగా అంటాడు. "నీకన్న నాకు ప్రపంచంలోఁ బ్రేమింప గలవారు లేరు. అట్టి నీభార్యను ప్రేమించుట, నాహృదయము కణకణలాడు నిప్పులలోఁ నిడవేసి కాల్చినట్లయినది.

మీనాక్షి ఏకవీర ఇంటికి పోతుండొకసారి. అప్పుడు" ఇరువురును జాజిపందిరి క్రిందుగా నేకవీర గదికిఁ బోవుచుండిరి. ఒక పసరు మొగ్గ ఏకవీరపైఁ బడినది. ఒకపచ్చియాకు మీనాక్షిపైఁ బడినది. పసరుమొగ్గ పచ్చియాకు, ఏకవీరా మీనాక్షి భవిష్యజ్జీవితాలకు ప్రతీకలు. కాలమనే లతకు పసరు మొగ్గ, పచ్చియాకు ఏకవీరా మీనాక్షులు. వికసించి ఆస్వాదంప బడిన తరువాత రాలవలసింది. పసరుగా ఉండగానే రాలిపోయింది మొగ్గ ఏకవీర జీవితంలో అదే జరిగింది. సృష్టి క్రమంలో తనవంతు కర్తవ్యం నెరవేర్చవలసి ఉండగా, భర్తకుట్టాన్ తనను ప్రేమించి ఆస్వాదించనున్న సమయంలో కాలానికి దూరంగా జరిగి పోయింది ఏకవీర. లతకు అంటిపెట్టుకొని పండుటాకుగా మారింతర్వాత రాలవలసిన ఆకు పచ్చగా ఉన్నపుడే రాలింది. మీనాక్షి జీవితంలో కూడ ఇదే జరిగింది. కాలమనే లతకు భర్త అనే ఈనెకు అంటిపెట్టుకుని ఉన్నపుడే ఆకు జీవితాంతం సజీవంగా ఉంటుంది. భర్త వీరభూపతి సన్యాసి కావడం వలన మీనాక్షి అతనినుండి తొలగినట్లు ఈనెనుండి కిందబడిన పచ్చియాకు త్వరలో ఎండి నశించక తప్పదు కదా! ఇంతభావం ఆ మొగ్గ ఆకులలో నిబిడీకరించారు విశ్వనాథ.

ఈ నవలలోని ప్రతీకల కన్నింటికి పతాక ధర్మానికి ప్రతీక, అమృతం పాత్ర. శకటసారథుల పదేండ్ల పిల్ల అమృతం "ఆపిల్ల తల వెండ్రుకలు సంస్కారహీనములై రాగి బొచ్చువలె దాని మొగము మీద వ్రాలు చుండెను" ఇది ఆపాత్ర ప్రవేశము 1939 ప్రాంతములలో పరపరిపాలనలో నున్న మన దేశమున ధర్మము అసంస్కృతమై క్షీణించి ఉన్నదని ఈ ప్రతీక ద్వారా ఆనాటి ధర్మస్వరూపాన్ని ప్రత్యక్షీకరించాడు విశ్వనాథ.

ప్రతిమానవుడి అంతరాత్మ ధర్మ ప్రబోధము చేయుచునే ఉండును. ఒక తప్పుపని చేయబోవుచున్నపుడు, ధర్మము తలచుకొన్న భయమగుచుండును. ఏకవీర సంఘ ధర్మము నాచరించుటకు సిద్ధపడి మళ్ళీ ఒకమారు వ్యక్తి ధర్మము వైపు చూడబోవును. అపుడు సంఘ ధర్మమంటే భయము. "గుజ్జుపువాళ్ళపిల్ల అమృతము తన పెద్ద కన్నులు మఱింత పెద్దవిచేసి కొని ఏకవీర వంక తదేక దృష్టితోఁ జూచుచున్నది...... ఏకవీరకు భయము వేసినది ... అమృతం ధర్మానికి ప్రతీక కనుకనే అమృతాన్ని చూసి ఏకవీర భయపడినది.

ఏకవీర తన్ను కుట్టాన్ ప్రేమించుట స్వప్నగత వృత్తాంత మనుకొని పూర్ణ ప్రేమమూర్తియైన వీరభూపతిని తలచుకొనును." ఇంతలో నమృతము తనవంకఁ దొంగి చూచుచున్నట్లులికిపడి 'అరండీ

విరంబు' తన చెవులలో ధ్వనించి మరల కట్టాన్ ప్రేమమూర్తి పరిణత భావుని భావించి నేలకుగాక మింటికి గాక పరితపించు చుండెను." కట్టాన్ పై ప్రేమ సంఘధర్మము వీరభూపతిపై ప్రేమ ఆత్మధర్మం కట్టాన్ ఏకవీరను ప్రేమిస్తానని శాంతకుముందు మాటిచ్చి నాడు, కాని నమ్మకము సడలజొచ్చినది. అంటేఆత్మధర్మమైన వీరభూపతిపై ప్రేమ కల్గించజూచినది. సంఘధర్మమైన కట్టాన్ పై ప్రేమ తగ్గించచూచినది. ఆ స్థితిలో అమృతము తనవంక జూచుచున్నట్లులికి పడినది, 'అరం దేవిరుంబు' అనగా ధర్మము నాచరింపుమన్న వాక్యము చెవులలో మార్మ్రోగినది సంఘ ధర్మానికి ప్రతీకయిన అమృతము కన్పించ గానే అనగా ఆపాత్ర హెచ్చరించ గానే సంఘధర్మమువైపు ఏకవీర మనసు మరలినది.

ఒకసారి వీరభూపతి ఇంటికి ఏకవీర పోతుంది. వీరభూపతితో స్పర్శసుఖ మును పొందుతుంది. సుందరేశ్వరునివైపు వస్తుంది "ఎదురుగా గుజ్జువాళ్ళ పిల్ల అమృతము నిలుచున్నది. చింపిరిజుట్టు, మాసిన పరికిణీ. చొక్కా లేదు. దాని కన్ను లెఱ్ఱగా నున్నవి. ఆమె (ఏకవీర) నిలువెల్లఁ జలించి పోయింది" ఏకవీరకు కట్టాన్ తో వివాహమవుతుంది ఆమెను ఇతరులు తాకరాదు ఆమె ఇతరులను స్పర్శించరాదు. అది సంఘపుకట్టుబాటు. అది సంఘధర్మము. అట్లు చేయుట సంఘధర్మానికి విరుద్ధం. ఏకవీర అట్లు చేసినది. సంఘంయొక్క ఆగ్రహాన్ని అమృతం పాత్రవర్ణనద్వారా, ఆపాత్రను ప్రతీక చేసి చూసారు రచయిత. అందుకే ఏకవీర చలించినది.

కట్టాన్ వచ్చి ఏకవీరను తాకబో తడు. ఆమె దొరకకుండా వెళుతుంది ఎక్కడక అంటాడు కట్టాన్. వైగైకి అంటుంది ఏకవీర. ఎందుకు అంటాడు. నాయెడల మహాఘమున్నది. అది కడిగి వేయుటకు అంటుంది ఏకవీర. అప్పుడు అమృతం వర్ణన "దువ్వని తలతో పరికిణీ తొడుక్కొని చొక్కా తొలిచి—యింటికి వచ్చుచు "అరం దేవిరుంబు—అని పిచ్చి పిచ్చిగాఁ బాడుకొనుచు వచ్చుచుండెను ఆమె ఏకవీరను జూచి భయపడి పారిపోయెను" సంఘధర్మానికి వ్యతిరేకంగా ప్రవర్తించిన ఏకవీర తన అధర్మాన్ని కడిగి వేయుటకు తనప్రాణాలనే వదలి వేయుటకు సిద్ధపడుతుంది. అంటే సంఘధర్మానికి న్యాయం చేకూరుతుంది. అందుకే సంఘధర్మానికి ప్రతీక అయిన అమృతం సంస్కృత యయి ఉంది. సంఘధర్మం కొఱకు ప్రాణాల్ని వదలటానికి సిద్ధపడిన ఏకవీరను చూచి సంఘం గడగడలాడింది ఆభావాన్ని అమృతంలో చూపించారు రచయిత.

అమృతంపాత్రను చివరిదాకా సంఘ ధర్మానిక ప్రతీకగా చేసి చెప్పడం ఈ క్రింది Keneth Burkle వాక్యాలను గుర్తుకు తెస్తుంది. "A Symbel is the verbel parlall to a pattern of experience"

—...—

# స్త్రీల పాటలలో అప్పగింతలు

— శ్రీమతి శిష్ట్లా లక్ష్మీనరసమ్మ, ఎం. ఏ.

(16, 17 సంచికల తరువాయి)

'సీత అప్పగింతలు' అను పాట యందు సీత తల్లి సీతను అత్తవారింటికి పయనము చేయుచు ఆమెకు సారెను సిద్ధము చేసినది. అంతయు సిద్ధమైన పిదప—

ముదముతో జనకులకు మ్రొక్కె వైదేహి
సన్నంపు ముత్యాలు జలపోసి నటుల
జానకి చెక్కిళ్ళ పడెను కన్నీళ్ళు

బిడ్డను అత్తవారింటికి పంపుచు తల్లి ఏవిధముగా వ్యథ జెందునో, అదే విధముగా అత్తవారింటిక పోవు బిడ్డ కూడ మిక్కిలి దుఃఖించును. తాను చిన్ననాటి నుండియు పుట్టిపెరిగిన ఊరు, తన తోడి చెలికాండ్రను తన సోదర సోదరీమణులను వదలి యుండుట ఆమెకు బాధాకరమైన విషయమే తాను అడుగిడ బోవునది క్రొత్త ప్రదేశము. అచటి వ్యక్తులందరును పరిచయములేనివారే. అచట తాననుభవింపబోవు జీవితమును తలచుకొనిన ఆమెకు అంతయు అయోమయముగనే యుండును. అందుచే నామెకు కన్నీళ్లు జలజల రాలినవి. జనకుడు కుమార్తె కన్నీటిని తుడిచి 'రాజాధిరాజ సురరాజశేఖరుడు, రాజాధిరాజనుత రామచంద్రుడు' నీపతి యనియు, దుఃఖింప వలసిన దేమియు లేదనియు, కుమార్తె నూరడించినాడు.

ఓ తల్లిరో నిన్ను కన్న లాభంబు
వారి అల్లుడాయె మాఅదృష్టముచేతా

అని శ్రీహరి అల్లుడగుటచే తమ జీవితములు ధన్యమైన వని భావించి తమ అదృష్టమునకు మురిసిపోయినాడు

అతివ తన పుత్రికి అన్నియును జెప్పి
అతి జాలిగా సుతను అప్పగించేను

పుట్టినింటికిని, మెట్టినింటికని — గౌరవము వచ్చునటుల ప్రవర్తింపుమని సీత తల్లి కుమార్తెకు హితవు నుపదేశించి కుమార్తెను అప్పగించినది

'సీతను అత్తవారింటిక పంపుట' అను పాట యందు సీతకు పైవిధముగనే బుద్ధులన్నియును గరపి, అల్లుడైన రామునితో జనకు డీవిధముగా పలికినాడు.

అల్లుడవూ చెలికాడవు తల్లివి తండ్రివి నీవే అని సీతాదేవి బరువు బాధ్యతలను, కష్టసుఖములను రామునికే అప్పగించినాడు. సీతకు తల్లి, తండ్రి, చెలికాడు రాముడే కనుక నామె జీవితమును సౌఖ్యప్రద మొనరింపజేయునది రాముడే అని విశదీకరించినట్లైనది.

పలుమారు మామీద ప్రేమ లుంచకుమీ అని తల్లిదండ్రులు కుమార్తెకు బోధింతురు స్త్రీకి పుట్టినింటిపై మక్కువ సహజము. ఆ సహజగుణముచే నామె తన వారి ఆధిక్యమును పలుమారులు అత్తింట కొనియాడు చుండును. ఈవిధముగా పుట్టినింటి వారి గొప్పతనమును పలుమారు వ్యక్తముచేయు చుండుటచే అత్తింటివారికి, భర్తకు ఆమెపై ఆగ్రహము కలిగి ఆమె గృహజీవనమున కలతలు ఏర్పడుట కవకాశముండును. దీనితో నామె జీవితము సక్రమముగా నుండక పోవచ్చును దీని నంతను గమనించియే తల్లిదండ్రులు కుమార్తెకు పలుమారు మామీద ప్రేమ లుంచకుమీ అని బోధించెదరు.

తల్లి కుమార్తెకు 'ఎన్నటికైనను నాథునిల్లె నిత్యమనుకోను' మని నుడువుచు కుమార్తె పుట్టినింటిపై బెంగపెట్టుకొనకుండుటకై తఱచుగ అన్నలను, తమ్ములను పంపెదననియు, పండుగలకు నిన్ను తీసికొని వచ్చెద మనియు కుమార్తెను ఓదార్చును. తన కుమార్తె క్రొత్త ప్రదేశములో నూత్న వ్యక్తుల మధ్య నేవిధముగ నుండునో యని తల్లడిల్లుచు తనను తాను సంబాళించుకొనుచు-

మూడు నెలలకు చెన్నుమీరగా తిద్దు
లొచ్చును
అన్నలను తమ్ములను పంపెద
అతివరో నిను తీసుకొస్తురు

అని కుమార్తెను ఊరడించి అత్తింటికి పయనము చేయించును.

తల్లిమారు అత్తగ జూడవే బిడ్డ
తండ్రిమారు మామ తనవలె కదె నెలు
కరుణ గలిగుండవే కమలాక్షి నీవు
ఎవ్వరికి ఎదురుగా బదులు మాట్లాడక
బెదరి ఉండుము తల్లి భేదంబులేక
తత్తరంబది విడిచి అత్తగారిమాట
చిత్తమున జేర్చుకో చిత్తారు బొమ్మ
పెద్దలు పిన్నలు వచ్చుమార్గము దెలిసి
గద్దెపై కూర్చున్న గ్రక్కన్న దిగవే

ఈ పాటయందు అత్తా కోడండ్ర నడుమ గల అనుబంధ మెంత సున్నితముగా నుండవలయునో వివరింపబడినది. ఆ సుతిమెత్తనితనము లేకయే అత్తా కోడండ్ర నడుమ కీచులాటలు ప్రారంభమగుచున్నవి. ఈ పాట ఒక వినూత్న పద్ధతిలో సాగినది. అప్పగింతల పాటలలో సాధారణముగ తల్లి తన కుమార్తెను కన్నబిడ్డవలె కాపాడుమని వియ్యపురాలిని ప్రార్థించినదే గాని తన కుమార్తెకు అత్తమామలను గౌరవింపవలయునని హితము గరపినదే కాని, వారిని తల్లిదండ్రులవలె భావింపవలయునని చెప్పలేదు ఈ గేయకర్త్రి (ర్త) మిక్కిలి అనుభవముతో రచించినటుల కాన్పించుచున్నది. కోడలు అత్తమామలను తల్లిదండ్రులుగ భావించి గౌరవించిన నాడే అత్తమామలు కోడలిని కన్న కుమార్తె వలె భావించి ఆదరమును చూపుదురు. కాని ఈ గౌరవాదరములు లోకములో అసాధారణములు గదా. పెద్దవారిని ఏవిధముగ గౌరవింపవలయునో గూడ నీపాట యందు విశదము చేయబడినది. ఈ పాటను రచించినది స్త్రీ కావచ్చునని నా ఊహ. అప్పగింతల పాట లన్నిటి యందును అత్తమామలకు మన్నన చేయుమనియు, వారి మాటను మన్నింపు మనియు బోధించిరే గాని అత్తమామలను తల్లిదండ్రుల వలె భావింపవలయునని బోధించినవారు లేరు ఈ గేయమును రచించినది స్త్రీ కనుకనే అనుభవముతో కూడిన ఈ భావములను సువ్యక్త మొనరించినది

మరియొక పాట యందు కామేశ్వరీ దేవికి తల్లి బుద్ధులు గరపుచు ఈవిధముగా పలుకుచున్నది

గడపాపై కూర్చుండి
జడవిప్ప బోకూ
కూర్చున్నప్పుడే తల్లి
కురులు దులపాబోకు

మనవారు గడపను గౌరీదేవిగా భావించి కొలుచుచుందురు. గడపను పసుపు కుంకుమలతో నలంకరింతురు. పూజనీయమైన గడపపై కాలుమోపుట, కూర్చుండుట, మొదలగునవి చేయకూడనివి గడపమీద కూర్చుండిన గడువరాని గండములు కలుగునని మన వారి నమ్మకము గడపపై కూర్చుండి జడవిప్పుట దరిద్రహేతువు. నేలపై కూర్చుండి కురులు దులుపుట కూడ అట్టిదే. కావుననే ఈపాట యందు చేయకూడని వానిని చేయుట వలన కలుగు ఫలితములను తల్లి కుమార్తెకు ఉపదేశించినది.

అప్పగింతల పాటలలో హాస్యపూరితములగు పాటలు గూడ కలవు. వీనియందు అప్పగింతల పాటలయందు సహజముగ నుండు కరుణరస పూరితమగు భావము లోపించి వినువారికి హాస్యజనకములై యుండును. ఈ పాటలు కేవలము హాస్యముకొరకై రచింపబడియుండవచ్చును. అప్పగింతల సన్నివేశము కరుణరసస్ఫోరకమై తల్లిదండ్రులకే గాక అచటనున్న వారందరికి హృదయములు భారమగును ఆ భారమును తగ్గించి వారి నందరిని ఉల్లాసపఱచుటకై కొంతమంది కొంటెకోణంగు లీవిధముగ పాటలను పాడి ఆ సన్నివేశమును ఉల్లాసవంతముగ చేయుదురు.

అత్తమామలు గాని ఆడబొడ్డెలు గాని
లేరమ్మ నీదెంత పున్నెమో గాని
మగడు వక్కడే గాన మనను
కక్కినయట్లు
మర్దించి నీవశము చేసుకోవమ్మ
నీమాట వినిపించు ఆ నిముషమందును
గజగజ వణుకునట్లు గడిగిసి చూపు
ఇరుగమ్మలు పొరుగమ్మలు ఏమైన అంటే
హడలిపోకను నీవు హడలుకొట్టమ్మ
పతి కోపపడినపుడు పడియుండబోక

ంతకు పడిరెట్లు అతని మర్దించు
ర్తను వందుకోగల భార్య గౌరవమెన్న
రారాజుకైన రమణిరో లేదు.

ఈ పాట ఎల్లోరా గారి సేకరణ
లోనిది. హాస్యరసపూరిత మగు అప్ప
ంతల పాట మరియొకటి కూడ కలదు
దియును ఎల్లోరా గారి సేకరణలోనిదే.

తివ్రతా ధర్మంబు భక్తితో సలిపి
తని చెంపా మీద అంటిస్తువుండు
ంగనితో నీకసలు సరిపడకపోతే
గదానివలె నీవు పడబోవుత ల్లీ
త్తమామలు నీకు అతకకాయుంటే
త్తముగ్గులుపెట్టి కృంగతియి తల్లి
వసేయించుకో చిన్న త్తలాచేతి
ావగారిని నీదు బానిసగ చూడు
టికోడలి బిడ్డ కూటికేడిస్తే
టకోడుచ్చుకొని ఒక పెట్టవమ్మ
త్తవచ్చి నిన్ను పనిచెయ్యమంటే
లకి పట్టేసుకో పడకేయవమ్మ
పెద్దలూ నినుచూసి పిలువవచ్చితే
పెద్దపెట్టున గోలపెట్టి కేకేయవే
కువలె మెత్తంగ ఎరుగనట్లుండీ
సీకువలె బిగుసుకొని మేలుకొనియుండు

ఈ పాటల యందు వివరింపబడిన విధ
ముగ ఏ స్త్రీ ప్రవర్తించినను, లోకము
మెను గయ్యాళిగంపక్రింద జమకట్టును
దియునుగాక ఈ నీతులను అమలులో
ంచిన కాపురము చేయుమగవాడే
యుండడు. కావుననే ఈ పాటలు కేవ
ము హాస్యము కొరకే రచింపబడినవని
ంపవచ్చును.

త్తవారింటికి పయనముగుచుండిన ఆ
డుబిడ్డ తన తమ్ములకు, చెల్లెంద్రకును,
న బొమ్మరిండ్లను, బొమ్మలను అప్ప
ంచుచు తనమారుగా ఆడుకొనుమని
చ్చినది

బొమ్మరిళ్లున్నాయి బొమ్మలున్నాయి
నేను ఆడేటి సాలలున్నాయి
నామారుగా మీరు ఆడుకోరమ్మా
పోయి నా అత్తింటికి పోయి వస్తాను
దీవించు అన్నయ్యా దీవించు అక్కా

దీని యందు అత్తింటికి పోవు ఆడుబిడ్డ యొక్క మనోవ్యథ విపులీకరింప బడినది. పెద్దవారైన అన్నయ్య, అక్కల దీవనల నందుకొని ఆమె అత్తవారింటికి పయనమైనది అంతవరకు తమతో నాడుకొని తమను విడిచి అత్తవారింటికి పోవుచున్న ఆమెను గని అన్నదమ్ములు, చెల్లెండ్రు ఏవిధముగా వ్యథ చెందుదురో దీని యందు ప్రతీయమాన మగుచున్నది

స్త్రీల పాటల యందు అప్పగింతల ఘట్టము మనోజ్ఞమయినది అయినను కరుణరసపూరితమైనది. హృదయమును కదిలించగల శక్తి కరుణరసమున కుండినటుల మరియే రసమునకును లేదు. కావుననే భవభూతి ఉత్తరరామ చరిత్రమున 'ఏకోరసః కరుణఏవ' అని ప్రతిపాదించినాడు అప్పగింతల పాటల యందు తను బిడ్డను విడిచియుండలేని తల్లిదండ్రుల వ్యథ తల్లిదండ్రులను, తోడి వారిని విడిచి క్రొత్త ప్రదేశములో ఏవిధముగా జీవితమును సాగింపగలమో యని ఆడుబిడ్డపడు వేదన, హృదయావర్జకముగ చిత్రింపబడినవి. ఈ పాటల యందు అత్తవారింటిలో తమ కుమార్తె ఏవిధముగా మసలుకొనవలయునో విపులముగ వివరించుచు, తల్లి కుమార్తెకు బోధించిన నీతులు విశ్వజనీనములై యొప్పుచున్నవి. అత్త ఆడుబిడ్డలకు తమ కుమార్తె నప్పగించు సమయమున తల్లిదండ్రుల మనోవేదన వీని యందు కరుణరసపూరితముగా చిత్రింపబడినది కరుణరస పూరితములై ఏసంబంధమును లేనివారికిని కన్నుల నీరు నిండునటుల రచింపబడిన ఈ పాటలకు స్త్రీల పాటల యందే ప్రముఖస్థాన మీయవచ్చును.

—•••—

# కవీ - విమర్శకుడూ ఆధునిక సాహిత్యానికి రెండుకళ్లు!

— శ్రీ సోమసుందర్

సాధారణంగా ఆధునిక కవిత్వం మానవానుభవాన్ని ఇతివృత్తంగా స్వీకరిస్తోంది అంటే కవిత్వానికి మానవీయత ప్రాతపదిక లక్షణ మవుతోందన్న మాట. నవ మానవీయ దర్శనం ప్రధాన ఆధార భూమిగా మారడానికి కారణం_ఆధునిక మానవుని జ్ఞానరంగం పరిధి మును పెన్నడూ ఎరుగనంతగా విశాలం కావడ మొకటి. దానికి దీటుగా జీవితావగాహన జరగక పోవడ మొకటీని!

నేటి సాహిత్యానికి సార్వత్రికంగా జీవితానుభవం, హృదయానుభూతి ప్రధానవస్తువులుగా దర్శనమిస్తున్నాయి ఇది కవితలకు మరీప్రధానమైంది బహుముఖాలుగా ఆధునిక జీవిత గాంభీర్యం కవితలో సాక్షాత్కరిస్తోంది జీవిత భీమా సంస్థ మొదలుకొని కుటుంబ నియంత్రణ ప్రచారం వరకు సర్వాంశాలు జీవిత పరిమేయాన్నే ప్రధాన లక్ష్యంగా స్వీకరించాయి అట్టి దశలో కవితకు దానిపట్ల బాధ్యత లేకుండా ఎలా ఉండగలదు ? కనుకనే అధునికకవి దీన్ని కర్తవ్యంగా తలదాల్చడంలో అబ్బురం లేదు అయితే ఒక తేడా లేకపోలేదు వైయక్తిక జీవితం కంటె సామాజిక జీవితమే ఆధునిక కవిత్వానికి ప్రాణప్రదమౌతోంది.

కొందరు భావవాదులైన కవులకు జీవితం స్వరూప స్వభావాల మిశ్రమ ద్రవ్యంగా కనిపించదు. నిర్దిష్ట స్వరూపం లేని గుణంగా మాత్రమే వారికి సాక్షాత్కరిస్తుంది. కేవలం ఆధ్యాత్మిక శక్తే సర్వ నిర్ణాయకంగా వారు భావి

స్తారు. ఇట్టి భావుకుల ద్వారా మేధారంగంలో వ్యష్టివాదాలు తలెత్తుతాయి. స్వాత్మిక సిద్ధాంతాలు స్థిరపడతాయి. వారికి సమిష్టికన్న వ్యష్టి ప్రధానమైనదవుతుంది.

హేత్వధీనంకాని ఇట్టి భావాలను ఆధునిక విజ్ఞానం అంగీకరించదు. వర్తమాన లోకానికి వైజ్ఞానిక విజయాలు రూపరేఖలు దిద్దుతున్నాయి. వైజ్ఞానిక శాస్త్రానికి హేతువాదమే చోదకశక్తి.

ఇక్కడే ఒక ప్రశ్న తలెత్తవచ్చు. మానవ జీవితం గురించి ఆధునిక కవిత్వం ఇంత బాధ్యతను తీసుకొంటోంది కదా. మానవ జీవితం కవిత్వంపట్ల ఏమైనా బాధ్యత వహిస్తోందా? అని - దీని కంత అనుకూలమైన సమాధానం రాదు. వర్తమాన జీవితంలోని కల్మషాలు, కశ్మలాలు, నికృష్టతలు వైదొలగి, పరిశుభ్రమైన గాలి, వెలుతురు సోకి; వర్తమాన లోకం మరింత వాసయోగ్యంగా పరివర్తన పొందినపుడు ఇది తప్పక సాధ్యం కావచ్చు. అంత మాత్రంలో నేటి సమాజమంతా జడమయమని, సమిష్టి జీవితాభివృద్ధిని గురించి కవి పాడిన చైతన్య గీతాలు వినిపించుకో లేక పోయిందని చెప్పలేము. అతడందించిన చైతన్యం నీటిలో, గాలిలో, మట్టిలో కలిసిపోయి, జాతికి పుష్టినిస్తూనే వుంటుంది.

కవి ఆలపించినగీతాలను ప్రత్యక్షంగా జాతి యావత్తూ వినిపించుకొన్నా, వినిపించుకోక పోయినా ఆలోపం కవిది ఎంతమాత్రంకాదు. అతని కవిత అశక్తమూ కాదు.

ఏకాలంలోకాని, ఏసామాజికవ్యవస్థలో కాని తనకు తానుగా మానవజాతి యావత్తూ కవితాభిరుచిని ప్రదర్శించదు. స్థూలంగా సమాజం ఆర్థిక ఆవర్తాలలో మునిగి తేలుతూ వుంటుంది. కవిత్వమూ, ప్రధానంగా గుణాత్మకమైనది. కవితా మాధుర్యాలను సమాజానికి వివరించే పూచీ వ్యాఖ్యాతది. కవిత కలిగించే దివ్యానుభవాన్ని జాతి కందించే బాధ్యతను స్వీకరించిన వ్యాఖ్యాతే ఉత్తమ విమర్శకుడు. తాను ముందుగా సహృదయతతో కవిత్వాన్ని అనుభవించి, ఆమాధుర్యాలను సోదర జనావళికి వ్యాఖ్యాత వివరించాలి. సామాన్య స్థాయిలో అందని విశేషార్థాలను విపులీకరించాలి.

దురదృష్టవశాత్తూ, మన ఆధునిక సాహిత్యంలో అలాంటి ఉత్తమ విమర్శకులు మరీ అరుదైపోతున్నారు. కవిత్వంతో బాహాబాహీ తలపడే విమర్శకులలో ఎక్కువమంది 'నిరంకుశ వైఖరి అవలంబిస్తున్నారు. తమ హృదయానుభూతులకు తావియ్యని తీర్పు లందిస్తున్నారు. కవుల తలలపై ఆశీస్సులగులక రాళ్ళు చల్లుతున్నారు.

నిజానికి కవీ! విమర్శకుడూ ఇద్దరూ ఒకే రసధాతువు నుంచి పుట్టిన వాళ్ళే! వీరిరువురి మధ్య వర్గకలహం వంటిది ఎప్పుడూ వుండదు. వీరిరువురు త్రాసుకు చెరోప్రక్కయిను.కనుక కవికన్న విమర్శకుడో, విమర్శకుడి కన్న కవో- తానే గొప్పవాణ్ణని పేచీ పడనక్కరలేదు. ఉత్తమకవిలో నూటికి నలభైపాళ్ళయినా సద్విమర్శకు డుండి తీరుతాడు. అలాగే ఉత్తమ విమర్శకునిలో సంగోరు భాగం కవితా హృదయం వుండి తీరవలసిందే! కవితా హృదయంలేని విమర్శకుడు పాషండు డవుతాడు. జీవిత సౌందర్యాలతో నిమిత్తంలేని శుష్కసిద్ధాంతాలు వల్లెవేస్తాడు. మౌలిక రసభావాలను అర్థం చేసుకోలేని పిడి వాదిగా మారిపోతాడు. అలాంటి విమర్శకునివల్ల సారస్వతానికి, జాతికి_ఏమీ ప్రయోజనం వుండదు.

లోకవృత్త పరిశీలన, బహుగ్రంథ పఠనమూ కవిలోని విమర్శనా జ్ఞానాన్ని పెంపొందింప చేస్తాయి. విమర్శనాజ్ఞానం లేని కవికి ఉచితానుచిత జ్ఞానం లోపిస్తుంది. శూన్యవాదిగా సౌందర్యాన్ని ఆరాధిస్తాడు. నిత్యం కన్నుల ముందు కొత్తరేకలు విప్పుకుంటూ సాగిపోతున్న బాహ్యవాస్తవికతను సందర్శించలేడు. ఏకాంతహృదయ వాదిగా, కేవలం ఆత్మాశ్రయవాదిగా తన ప్రతిభను పరిమితం చేసుకుంటూడు. అంటే ద్రష్టకాలేకపోతాడన్నమాట. తద్వారా స్ఫూర్తిదాయక కవిత్వాన్ని ప్రదర్శించలేడు. వెరసి అశక్తుడుగా మిగిలిపోతాడు. వాస్తవదర్శనం లేనివాడు ఋషికాలేడన్నది కొత్తగా చెప్పుకోవాల్సిన మాట కాదు.

అందువల్లనే సజీవ సాహిత్యానికి ఉత్తమకవీ. ఉత్తమ విమర్శకుడూ రెండు కళ్ళు అని చెప్పడం!

ఈ రెండుకళ్ళూ సక్రమంగా పని చెయ్యాలి. మనదృష్టితో భాసించాలి. ఏనేత్రానికి విషమదృష్టి ఏర్పడినా_కాకి చూపు మిగులుతుంది, కవికి కాకిచూపు వుంటే నష్టపడేది కవే! అది ఎంతవ్యక్తిగతమని సరిపెట్టుకున్నా, అతడు కాకవి కాక తప్పదు ... ఇలాంటిదృష్టి విమర్శకునికుంటే అది మరింత ప్రమాదకరం. కేవలం పాక్షికదృష్టితో స్వీయ సిద్ధాంతాల్ని నెలకొల్పి, కువిమర్శకుడవుతాడు. కవి వ్యక్తపరచిన అనుభూతులను పరిగణించడు. భుజబలంతో అతడెంత వ్రాసినా సార్థక్యం వుండదు. సద్విమర్శకునికి సాహిత్యలోకంలో విశిష్ట స్థానం వుంది.

ప్రతి కవితా గ్రంథమూ బాహ్యంగా మూగదానిలాగే కన్పిస్తుంది. తెరచి మన కనుల ముందు నిలుపుకునే సరికి దాని నుంచి సుమధుర కంఠనాదం వెలువడుతుంది. మన చైతన్యాన్ని ముంచెత్తుతుంది. ఆకంఠం మనకిదివరలో పరిచయమైంది కాదు. నిత్యం మనచెవులకు విని పిస్తూ అలవాటయిందీ కాదు. ఏనూత్న

కాంతితో ఆ కంఠనాదం మన హృదయాన్ని ఆక్రమిస్తుంది.

ఆ కవితను ఏవో వినిపించడమే పని కాదు. మనదైన దేనినో మనకే విన్పిస్తుంది సాధారణంగా మన విస్మృత భాండారంలో నిద్రించే అనుభూతుల్ని మేలుకొల్పుతుంది. కాని, ఆ వినిపించే దాన్ని వినగలిగే లోపలి చెవి మనకి వుండాలి. స్వతస్సిద్ధంగా పాఠకులందరికీ ఆ చెవి లభించక పోవచ్చు. వ్యాఖ్యాత దానిని సమకూర్చాలి. అతడందించిన తాళంచెవితో కవితా భవనపు ప్రధాన ద్వారంనుంచి పాఠకుడు ప్రవేశించగలుగుతాడు. ఈ పాఠకుని హెచ్చవేస్తే వచ్చే బహువచన రూపమే సమాజం!

వచ్చిన చిక్కేమిటంటే, మనవిమర్శకులలోనే పాపం చాలామందికి అలాంటి చెవి లభించలేదు కనుకనే కవుల రస మాధుర్యాలను అల్పంగానైనా ఆవిష్కరించలేకపోతున్నారు. ఈ లోపంవల్లనే ప్రతిభావంతులైన కవులుకూడ కవిత్వ హ్రస్వలిపిలో తమ అనుభూతులను అభివ్యక్తం చేయలేక పోతున్నారు. కల్పనాత్మకంగా కవితలను సృజించలేక పోతున్నారు. తమ దర్శనను కవితా స్వరూపంలో తామే వ్యాఖ్యానాలు రచించుకోవలసిన దుస్థితికి దిగజారుతున్నారు. అచ్చమైన కవితలను రాయలేక పోతున్నారు.

ఈ లోకంపట్ల జీవితం పట్ల కవులకు పాపం ఎన్నో ఆత్మవేదన లున్నాయి. కాని వారి అనుభవాలను స్వగత వ్యాఖ్యానాలుగా విస్తరించుకు పోతుంటే పాఠకులు విసుగుచెంది దృష్టిమరల్చుకోవలసి వస్తోంది. వర్తమాన కవుల స్థితే కాక, పాఠకుని స్థితికూడా దయనీయమైనదే! అంతేకాదు; కవితాలూకు స్వగత వ్యాఖ్యాలను పాఠకులు over hear చేయవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. అంటే అచ్చమైన కవిత్వాన్ని వినలేని సహృదయుని స్థితి మరీదురదృష్టమైనది.

ఒకప్రక్క మంచి కవిత్వమూ వుంది. ఇది ఈ కారణాలవల్ల మంచి కవిత్వమని వివరిస్తే విని ఆనందించే సహృదయుడూ వున్నాడు కాని వాడి చెవికి కవిమ్మన్యుల స్వగతాలు తప్ప మరేమీ వినిపించని జాతర ఒకటి బయట సాగిపోతోంది శ్రుతి, లయలతో నిమిత్తంలేని వెర్రి డప్పుల మోత ఒక్కటే ఇదిగా అరు బయట మ్రోగిపోతోంది.

ఇటు కవిగాని, అటు విమర్శకుడుకాని ఇరువురు అచ్చంగా ఆశావాదులు కావలసిందే ఆశావాది కాకపోతే హృదయాన్ని నిత్యహరితంగా పెంచుకోలేడు. నవనవోన్మేషశాలిత నలవర్చుకోలేడు. గతంలో తన సృజనలనో, తమపూర్వులనో చూసి మురిసిపోతూ వుంటాడు ప్రతిభాశాలిగా నూత్న సృష్టి చేయలేని బలహీనుడౌతాడు. వున్న దానిని చూసి సంతృప్తిపడి, హాయిగా నిద్రపోయే కుహనా సుఖవాదిగా మారిపోతాడు. అలాంటి కవికి సద్గతి లేదు.

ఆశావాదికాని విమర్శకుడు సాహిత్యంలో ప్రయోగవాదాన్ని పరిశీలించలేడు గతకాలపు సాహిత్యాన్ని ప్రస్తుతిస్తూ, వర్తమానం గతానికి మించిన సాహిత్యాన్ని సృష్టించనేలేదన్న స్థిరాభిప్రాయంతో హృదయాన్ని శిలాసదృశంగా చేసుకుంటాడు. తాను బ్రతుకుతూన్న కాలంపట్ల గ్రుడ్డివాడవుతాడు. ఇలాంటి విమర్శకునకూ ఉత్తమగతి లభించదు

ఆశావాదులు కాని రచయితలు లోపభూయిష్ఠ దర్శనంవల్ల లోకానికి మేలు చేయకపోగా వర్తమాన లోకంపట్ల కార్పణ్యాన్ని పెంచుకుంటారు యువతరం ఎందుకూ కొరగాని సాహిత్యాన్ని సృష్టిస్తున్న దంటూ వాపోతూవుంటారు. సజీవవర్తమానం నెత్తిమీద మృతగతాన్ని మోపచూస్తారు. నిందల బండరాళ్లు దొర్లిస్తారు. ఇలాంటి విమర్శకులు అకారణ ద్వేషాన్ని పెంపొందించుకొనే దుఃఖభాజనులు! నిరాశతో వర్తమానాన్ని నిరాదరించే వారికి భవిష్యత్తుపరచే బంగారు కాంతు లసలే కనిపించవు!

అచ్చమైన కవియహృదయం తాను విరక్తికి అంకిత మవకూడదు సంప్రదాయ శృంఖలాలతో తనహృదయాన్ని బంధించుకోకూడదు. ఒక జాతి సాధించిన వారసత్వం ఆజాతిక సౌరభవీచికావాలేతప్ప, అవరోధం కాకూడదు. గతసంప్రదాయం తనకు ఆహారపానీయాలందించే సారభూతమైన భూమివంటి దన్న జ్ఞానం వుంటే చాలు. వర్తమానాన్ని గతం పాలించగల దనుకోవడం వివేకం గాదు. గతాన్ని చీల్చుకొని ప్రభవించినదే వర్తమానం

సృజనాత్మకశక్తి, ఆర్ద్ర హృదయము, గల కవి వర్తమానాన్ని ప్రేమించాలి గడుస్తున్న వర్తమానం ఇటు గతంలో కలిసిపోతూ నే భవిష్యత్తును తనలో సంలీనం చేసుకుంటుంది కాలంచేసే ఈ ఇంద్రజాలంలో సత్కవి తనపాత్రను తాను గుర్తించగలుగుతాడు వర్తమానాన్ని తీర్చి దిద్దడంలో తన పాత్రను ఆత్మవిశ్వాసంతో బలోపేతం చేసుకుంటూ పురోగమిస్తాడు

వర్తమాన బౌద్ధికరంగంలో శాయశక్తులా కృషి సల్పాలన్న ఆత్మజ్ఞానం ఉత్తమద్రష్టకు వేగుచుక్క కాగలదు. ఈ అంతశ్చైతన్యంనుంచి ప్రాదుర్భవించిన వారే కావడం వల్ల-కవీ, విమర్శకుడూ తమ కృషితో భావిపథాన్ని నిష్కంటకంగా మలచగలుగుతారు

వర్తమానంలో కవిమ్మన్యులు అధిక సంఖ్యాకులుగా ఉన్నారని వారు కవితలనుగాక, వ్యాఖ్యానాలనే వ్రాసుకుంటూ పోతున్నారని ముందే మనవిచేశాను. ఇలాంటి వ్యాఖ్యానాల్లో తమ ముఠాకోసం వ్రాసుకున్నవే ఎక్కువ వుంటాయి.

ఈ ముఠా అంతా ఆ కవిలాగే ఆలోచించే వాళ్ళు కనుక తానుగా వారిని ఒప్పించే పూచీ ఆ కవికి లేదు. తన వ్యాఖ్యానం చెప్పుకుంటూ పోవడమే పని. ఈముఠాకు సదరు కవి ఏమి చెప్పదలుచుకున్నదీ ముందే తెలుసు. కనుక వినవలసిన పూచీ వారికి లేదు. వింటున్నట్లు నవ్వు ముఖం పెట్టి కరతాళధ్వనులు చేస్తుంటే చాలు. కవికి ఘన సన్మానమే!

అంటే ఒక కవితాలూకు కవితానుభూతి కంటె ముందే బజానాగా అతని అభిప్రాయాలు, సిద్ధాంతాలు, విశ్వాసాలు ఒక ప్రజాశ్రేణికి తెలిసివుండవలసిన అవసరం వున్నదన్నమాట! ఈవిధంగా కవిత్వాన్ని చెలామణీ చేస్తున్నవి సిద్ధాంతాలవుతున్నాయి తప్ప-కవితాగుణం కావటం లేదు. వర్తమాన మేధారంగాన్ని సంకీర్ణం చేయడంలో ఇదీ పాత్ర వహిస్తోంది. దేనిపట్లనూ ఇదమిద్ధంగా తాత్విక కాంతి ప్రసరించడం లేదు. సర్వత్రా 'ఖయాసు' ఏర్పడిఉంది. దీని ఫలితంగా అరిగీ అరగని ఇజాల కలగాపులగాన్ని రూపొందించి వర్తమాన మేధారంగాన్ని కలుషితం చేస్తోంది.

కవికి ప్రధాన వాంఛితార్థం కవితాశక్తి! తాత్త్విక చింతనా, అభిప్రాయమగ్నతా వంటివన్నీ గౌణాలుమాత్రమే! ప్రథమగణ్యాలు కానక్కరలేదు. కాని దురదృష్టవశాత్తూ ఈకాలంలో ప్రధాన కవితాశక్తి గాలికి విడిచిపెట్టబడుతోంది. ద్వితీయ శ్రేణిలో నిలువవలసిన అభిప్రాయాలకు, విశ్వాసాలకూ ప్రాముఖ్యం విస్తరిస్తోంది. తద్వారా సిద్ధాంత వైరుధ్య కారణంగా కవితాశక్తికూడా తిరస్కరించబడుతోంది. దానితో కల్లోల మేర్పడుతోంది. గౌరవించవలసిన కవితా మూల్యాలు గాలికి పోతున్నాయి.

వర్తమాన యుగం సర్వాభిప్రాయాలనూ, సర్వతాత్త్వికాంశాలనూ పరీక్షకు పెడుతోంది. నిరవధిక కాలవాహినిలో అభిప్రాయాల సత్యాసత్యాలు తేలగలవు. ఆచరణలో రుజువుకాగలవు. ఇజాల నిజానిజాలు ఉత్తీర్ణత పొందగలవు. అంతవరకూ కవి-కవిత్వాన్ని విడిచి, తత్త్వాన్ని కవిత్వ మనుకొని భ్రమచెందడం ఎవరికీ మేలు చేయదు.

ఎవడు ఏ అభిప్రాయాలకు చెందిన కవియైనా ఉత్తమ కవిత్వాన్ని అందిస్తే దానిని తలదాల్చడానికి ఎవరికీ అభ్యంతర ముండదు. కాని, పచ్చి రాజకీయ నినాదాన్ని వ్రాసి ఇదే ఉత్తమ కవిత్వమని డబాయిస్తే ఎవ్వరూ సహించరు. నినాదాలంటే రాజకీయాలకి సంబంధించినవే కానక్కరలేదు. దేనికి సంబంధించినా నినాదాలు శుష్కాలే! సీనారేకు డబ్బాల్లో చిల్ల పెంకులు పోసి గలగలలాడించేవాడు అదే సుస్వర సంగీతమంటే ఎవ్వరూ కిమ్మనకుండా ఊరుకోరు.

వ్యాసాలనో, రాజకీయ ఉపన్యాసలనో నడుములు విరచి వచనపు తుంటలు పేర్చి-ఇదీ కవిత్వ మంటే అది బలహీనుని ఆక్రందనమే కాగలదు; కాని ఆహ్లాదకవిత్వం కాలేదు. అరణ్యక ఆక్రోశాలను కవిత్వమనుకునేవారు మయసభలో ప్రవేశించిన దుర్యోధనులు. ఉత్తమ కవిత్వం ద్రౌపది; అట్టివారి భంగపాటును చూసి నవ్వ కేంచేస్తుంది?

కవులూ, విమర్శకులూ తమ సహజ బలాబలాలను సజావుగా బేరీజు వేసుకుంటూ పురోగమించడమే కర్తవ్యం. ప్రతి మనిషీ ఈలోకానికి అతిథిగా వచ్చి తన సజీవపాత్రను తాను నిర్వహిస్తాడు. ఈ పురాతన పాంథశాలలో కాస్సేపు విశ్రమించే తీర్థయాత్రికుడు తనకు సృష్టి ప్రసాదించిన సదవకాశాలను వినియోగించుకొని; చిరసుందర స్వప్నాలను కంటాడు. వినగలిగే తోటివారికి వినిపించి అలరిస్తాడు. కల్పవృక్షంవంటి తన హృదయం నిత్యం విరిసే పుష్పాలను శక్తికొలదీ ఏరుకుంటాడు; మాలలు గుచ్చి ప్రేమగా సామాజికులకు అందిస్తాడు.

కవిత్వం అవిచ్ఛిన్నంగా ప్రవహించే గంగా ఝరివంటిది. ప్రతికవీ తన శక్తి కొలది తనకు అలవియైన పాత్రలతో ఈ గంగాజలాన్ని పట్టుకుంటాడు. తను కూడా మోసుకు తెచ్చుకుంటాడు. దారిలో ఎదురైన వారికి తలోయింతా పంచి పెడతాడు. ఎవడి శక్తి వాడిది! చిత్తశుద్ధితో తెచ్చే గంగాజలంలో ఎంతమాత్రం విభేదం ఉండదు.

పంచినది గంగాజలం కావాలే తప్ప అది అందరికీ ఆస్వాద యోగ్యమే! అందరికీ శిరోధార్యమే!

[ఆకాశవాణి - విశాఖ కేంద్రం వారి సౌజన్యంతో...]

—...—

# నవలా సాహిత్యము - శ్రీమతి రంగనాయకమ్మ (1947 - 77)

— కుమారి తుళ్లపాటి రాజేశ్వరి, ఎం. ఎ

స్వాతంత్ర్యానంతర - తెనుఁగు నవలా సాహిత్యమందు మారుతున్న సమాజములో స్త్రీసమస్యలను శక్తివంతముగా చర్చించుచు, సంస్కరణ ప్రయత్నముతో రచనలు సాగించినవారిలో శ్రీమతి రంగనాయకమ్మ ఒకరు 1958 లో రచింపబడిన 'పల్లెటూరు' నుండి 1977 లో రచింపబడిన 'జానకి విముక్తి' వఱకు వ్రాసిననవలలను పరిశీలించి చూచినచో క్రమముగా ఆమెలో వచ్చిన భావపరిణామములు స్పష్టమగును

ఆమె నవలలన్నియు సాంఘికములు.

పల్లెటూరు(1958), కృష్ణవేణి (58), ఆండాళ్ళమ్మగారు, పేకమేడలు (62), నాడైరీలోఒకపేజీ (63), కూలినగోడలు (64), స్త్రీ (65), రచయిత్రి (65), చదువుకున్నకమల, (66) కళ ఎందుకు ? ఇదేనా న్యాయం (68), స్వీట్ హోమ్ (68), అంధకారంలో (72), ప్రేమ ప్రేమను ప్రేమిస్తుంది (72-73), జానకి విముక్తి, (1977)

ఈ నవలలయందలి యితివృత్తములు

1 పల్లెటూరు ఇందిర తనకాబోవు భర్తయగుకృష్ణమోహన్ తో కలిసి పల్లెటూరునకేగి అటకొన్నిదినములుండి మరల పట్టణమునకేగుట యిందలికథ ఈనవలిక యందు రచయిత్రి ఇందిర,కృష్ణమోహన్ మేనకోడలు తులసి, పాత్రలమూలమున పల్లె, పట్టణముల మానవుల నడువడి నుండెడ ఆలోచనా విధానములందలి వైరుధ్యములు చిత్రింపబడినవి

2 కృష్ణవేణి కృష్ణవేణి మాధవరావును ప్రేమించి అతడు వివాహితుడని తెలిసిన పిమ్మట తిరస్కరించి శ్యామసుందర్ ను వివాహమాడినది శ్యామసుందర్ మాధవరాజు వద్దనుండి వచ్చిన ఉత్తరములను చూచి కృష్ణవేణి ననుమానించి వెళ్ళిపోవగా కృష్ణవేణి తన కథనంతను ఉత్తరముల రూపముల తెలియ జేసినది ఆకర్షణ - వాస్తవప్రేమల మధ్యదూరము ఇందు చూపబడినది

3 ఆండాళ్ళమ్మగారు పార్థసారథి పద్మలతలది ముచ్చటైన దాంపత్యము దూరపుబంధువగు ఆండాళ్ళమ్మ వారి యింటఁజేరినది ఆండాళ్ళమ్మ దొకవిచిత్రమైనప్రవృత్తి. ఆమెదంపతులనడుమ కలహములు పెట్టవలె నని ప్రయత్నము చేయును ఆమెవైఖరికి విసిగిపోయినపార్థసారథి ఆమెను బయటకిగెంటివేయుటలో కథ ముగియుచున్నది

సుఖజీవులమధ్య విభేదములు కల్పించి, ఆండాళ్ళమ్మ మనస్తత్వమును బహిర్గతమొనర్చుటకు రచయిత్రి కల్పించిన సన్నివేశములు, సంఘటనలు వాస్తవముగా నున్నవి

పేకమేడలు చదువుసంస్కారములు భానులో గుబాళించినవి ఆమెను పెండ్లాడిన రాజశేఖరము సంస్కారరహితుడు స్త్రీ అనగా కేవలము వంటయింటికి, పడకటింటికి పనికివచ్చెడి సాధనముగా తలంచెడివ్యక్తి భర్తప్రవర్తనకు గాయపడిన భాను ఆత్మహత్య చేసికొనినది స్త్రీని బానిసగా మాచెడి పురుషుని ద్వేషమునకు బలియైన అబల జీవితము ఇందు చిత్రింపబడినది.

5 నాడైరీలో ఒకపేజీ ఈ రచనలో కథానాయకి పెళ్ళిఅయిన రచయిత్రి ఆమె భర్త ఆమెను కథలు వ్రాయమని బలవంతము చేయుచుండును 'రోజుకొక కథనారాయలేని నువ్వూ' పుట 62 అని కించపరుచుచుండును ఈ విధముగా వతనితో సంసారముచేయుచు నేరచయిత్రి ఒకసరోజవెంటబడి అవమానముపాలైన గోపాలంకథ వ్రాసినది.

ఈనవలికయందు స్త్రీపురుషుల భిన్న వ్యక్తిత్వములు - కాలేజీవిద్యార్థుల ప్రవర్తన చూడగలము

6 బలిపీఠం మరణావస్థలో నున్న బ్రాహ్మణ బాల వితంతువునకు అరుణకు సుమంగళిగా మరణించవలెనను కోరిక కలదు హరిజన యువకుడు భాస్కర్ అరుణను ఆరోగ్యవంతురాలి నొనర్చి వివాహము చేసికొనినాడు అరుణలో కాలక్రమమున కులాభిమానము,భర్త బంధువులపట్ల నిరాదరణ యేర్పడినది. అరుణ భాస్కర్ పై అనుమానముతో దూరమై కోర్టువారిద్వారా విడిపోయినది. భాస్కరరావుమరల కరుణాశ్రమమునకు వెళ్ళినాడు పశ్చాత్తాపురాలైన అరుణ కడకు భాస్కర్ చేతులలో మరణించినది

వర్ణాంతర, మతాంతర వివాహముల వలన వచ్చెడి పర్యవసానములను దీర్ఘముగా చర్చించుటయే ఈ నవల ముఖ్యోద్దేశ్యము

7 కూలినగోడలు సూర్యం మధులతల్లి ప్రసవవేదనతో మరణించినది భార్య మరణముతో దుఃఖితుడైన జగన్నాథం ఇల్లు వదలి వెళ్ళిపోయినాడు మేనమామల ఆశ్రయములో, అత్తల చీదరింపులమధ్య సూర్యం, మధు పెరిగి పెద్దవారైనారు సూర్యం ఉద్యోగస్థుడు అయిన వెంటనే వేరుకాపురంపెట్టాడు మధు అన్నావదినల ఆప్యాయత-అనురాగాలమధ్య పెద్దచదువులు చదివి ఉద్యోగము సంపాదించెను మిత్రురాలగు శారదాదేవికి మధు తనకథనంతను చెప్పును

ఉమ్మడికుటుంబాలలో స్వార్థపూరిత వ్యక్తులవలన క్షోభించే హృదయాల మనస్థితి ఇందు వర్ణింపబడినది

8 స్త్రీ పార్వతి, పద్మజ, రఘుపతి ఆబాల్యస్నేహితులు పెరిగి పెద్ద అయిన

శ్రీధరరాయకవి
(M B B S D T M చీరాల)
బహూకరణము 1969

తరువాత ముగ్గురిజీవితములు వేరైనవి. ముగ్గురి జీవిత వైవిధ్యాలను చక్కగా చూపించిన దీనవల. పార్వతీరఘుపతులు ఒకరినొకరు అభిమానించుకొని, ప్రేమించుకున్నారు అంతస్థుల అడ్డుగోడ ప్రతిబంధకముకాగా, రఘుపతి తల్లిదండ్రులు రఘుపతికి వేరుసంబంధము చేశారు పార్వతిమారిన ఇంటిపరిస్థితులకుతలవంచి సంసారభారమును మోసినది ఇంటికి తానే మగవాడై నిలిచినది. రుక్మిణికి, సూర్యానికి వివాహములు చేసి, తానువంటరిగా నిలిచిపోయినది పార్వతి స్థానంలో ప్రవేశించిన సుశీలను ఆదరించలేని, రఘు ప్రవర్తనతో అతడిభార్య సుశీల మనోవ్యాధితో మంచముపట్టి మరణించినది పద్మజ డాక్టరై జేమ్సుని కోరి వివాహమాడినది అన్నివిధముల సుఖపడినది ఈ నవలలో సమాజములో స్త్రీ ఎదుర్కొనుచున్న అనేకానేక సమస్యలు చిత్రింపబడినవి

9 రచయిత్రి మోహన్ విజయను రచయిత్రి అని తెలియకముందు వివాహమాడినాడు ఆమెరచయిత్రిఅని తెలిసినపిమ్మట ఆమెలో ఆధిక్యత నతడు సహించలేకపోయినాడు ఫలితముగా ఇరువురి నడుమ భేదాభిప్రాయములు, ఘర్షణములు ప్రారంభమైనవి. విజయ పుట్టినింటికివెళ్ళిపోయినది. విజయదూరమైనలోటు స్పష్టముగా తెలియుచుండగా మోహన్ అశాంతికి లోనైనాడు. నవలాంతమునకు అతడు భార్యవద్దకు వెళ్ళినాడు.

ఈనవలలో స్త్రీపురుష వ్యక్తిత్వముల మధ్యసంఘర్షణ ప్రధానవిషయము. ప్రసక్తానుప్రసక్తముగా వరకట్న సమస్య, బహుభార్యాత్వము మున్నగు విషయములిట చర్చింపబడినవి.

10. కళఎందుకు ? బలరామయ్య తన కుమార్తె కళాబాలకు వీణనేర్పించెను. పిమ్మట చంద్రశేఖర్ తో ఆమెకు వివాహమైనది. ఆమె వీణవాయించినతమ పరువు మర్యాదలు గంగలోకలియునని తలచే అత్తగారినుండి, మగడాక్టరు నీడపడితే ఆమెను ఏలుకొననని ప్రతిజ్ఞ చేసిన మూర్ఖుడగు భర్తనుండి కళాబాలకు దేవుడు విముక్తి కలిగించినాడు. బలరామయ్య కుమార్తెబిడ్డలు పద్మినీ, మోహినలను పెంచి పెద్దచేసి తన యభిరుచులకనుగుణముగా వారిని నృత్య గానాదులయందు ప్రవీణలనుగా చేసినాడు. పద్మిని గోపాల్ ను ప్రేమించి అతడు ఊరువదలి వెళ్ళినాడని ఆత్మహత్య చేసికొనిన అమాయిక. పిమ్మట మోహిని సుధాకర్ ను వివాహమాడినది. వివాహానంతరము సుధాకర్ మోహిని నృత్య ప్రదర్శన లిచ్చుటకు అంగీకరించలేదు. మోహిని భర్తను వీడి కళానిలయమునకు వచ్చి నృత్యగానము లభివృద్ధిచేసికొని పేరుప్రఖ్యాతులార్జించినది. ఈ నవలాంతమున మోహినీ సుధాకర్ లు కలుసుకొనెదరు.

రసాస్వాదన చేయలేని హృదయాల తీరుతెన్నులు, కళకు జీవితమునకుగల సంబంధము, కళమానవునిలోఅంతర్గతముగా దాగియున్న సంస్కారమును వెలికిదీసి ఆనందానుభూతిని ప్రసాదించు విధము వివరింపబడినవి.

11 ఇదేనా న్యాయం పట్టుదలతో స్వశక్తితో పైకివచ్చిన శంకరంకథ. తండ్రిగా తన కర్తవ్యమును నిర్వహించని శేషయ్య వృద్ధాప్యములో నిర్వీర్యుడై కొడుకులనీడను బ్రతకవలెనని వచ్చినాడు.

బాధ్యతా రహితులైన తల్లిదండ్రుల వలన పసిహృదయాల క్షోభ మున్నగునవి ఇందు చర్చింపబడినవి.

12. స్వీట్ హోమ్ 1, 2, భాగములు విమల బుచ్చిబాబుల ఆనందమయ జీవనమును, విశాలా శ్యామలరావుల వ్యక్తిత్వముల సంఘర్షణను, చిత్రించెడి నవల. ఇందు స్త్రీ విద్య, స్త్రీ ఆస్తిహక్కులు, వరకట్న సమస్య, స్త్రీ సంసారజీవితములో ఎదుర్కొను సమస్యలు తార్కికముగా చర్చించబడినవి.

13. చదువుకున్న కమల ఈనవలలో నాయిక కమల చదువుకున్నది ఆమెభర్త మధుమూర్తి తల్లిదండ్రుల నెదిరించలేని బలహీనత కలవాడు. కవల సంసారమును దిద్దుకోవలె ననెడి ప్రయత్నము అత్తమామల మూర్ఖత్వముతో కుదరలేదు. ఫలితముగా సంసారము అప్పుపాలైనది. ఈనవలలో రచయిత్రి స్త్రీలలో బలహీనతగల వ్యక్తిత్వం, మగవారిలో తాము గొప్పవారమని బాల్యమునుండి యేర్పడిన విధానము, తల్లిదండ్రుల పెంపకములో విశ్లేషించి చూపరి

13. అంధకారంలో సమాజములో స్త్రీ పురుషుల శృంగార జీవితము ఇందు సమీక్షింపబడినది.

సంఘ నియమముల నతిక్రమించినందులకే కనీసన్యాయము పొందని రాధ — వ్యభిచారిణులు రాజేశ్వరి, దుర్గ-భర్తతో జీవచ్ఛవమువలె గడిపి పిచ్చిదైన సుందరమ్మ - తనకు తానుగా ఇష్టపడి చేసుకున్న లలితను అవమానించిన శేఖర్, సంసార జీవితములో సుఖాన్ని పొందక అడ్డదారిత్రొక్కిన మహాలక్ష్మమ్మ, అక్కడక్కడ పద్మా కృష్ణారావులవంటి దంపతులను ఈనవలయందు చూడవచ్చును.

అంధకారంలో ఉన్న సంసారజీవితాలు, స్వేచ్ఛగానైనా సుఖపడాలనే మార్పుకోరే నవల.

14 ప్రేమ ప్రేమను ప్రేమిస్తుంది సుధ తల్లిదండ్రులు పద్మావతీ వెంకట్రావులది వర్ణాంతరవివాహము. ప్రేమించి, వివాహమాడిన వారిరువురునుకూడ తగవులాడుకొనుట చూచిన సుధకు మహాశ్చర్యము కలుగును అట్లైన ప్రేమ వివాహము చేసికొనిన దంపతులకు, తల్లిదండ్రులు కుదిర్పగా చేసికొనిన దంపతులకు తేడా ఏమని సుధ అనుమానము. ప్రేమ శాశ్వతముగా ఇరువురనడుమ వుండదాయని సుధ ప్రశ్న.

ఈ నవలలో రచయిత్రి కులాంతర వివాహములు చేసుకొనిన దంపతుల జీవన విధానమును గురించి, స్త్రీ పురుష సంబంధములను గూర్చి చర్చించిరి

15. జానకి విముక్తి జానకి భర్త వెంకట్రావు యమ్. ఎస్. సి చదువుకుని- చదువుకు సంస్కారమునకు సంబంధము లేదని చెప్పటానికి ఉదాహరణ ప్రాయముగా పేర్కొనవలసిన వ్యక్తి. తరతరాలుగా స్త్రీలు బానిసలు అని నమ్ముతూ, స్త్రీని చెప్పుకింద తేలులా వుంచవలె ననెడి అహంకారమునకు, మూర్ఖత్వమునకు ప్రతినిధి. ఇక జానకి నేటి సమాజములో స్వతంత్రాలోచన లేని స్త్రీకి ప్రతినిధి. చుట్టుపక్కల వారు తనమీద జాలి చూపించవలె ననెడి మనస్తత్వము, భర్తను ఎదిరించలేని నిస్సహాయత, పిరికితనము జానకిలో కన్పిస్తవి.

స్త్రీని బానిసగా చూచే కుటుంబ వ్యవస్థ సమర్థముగా చిత్రింపబడిన నవల.

శ్రీమతి రంగనాయకమ్మ రచనలలో కాన్పించెడి స్త్రీ పురుష సంబంధమైన సిద్ధాంత చర్చ, దాంపత్య జీవితములో భార్యాభర్తల వ్యక్తిత్వముల సంఘర్షణ, సమాజ చిత్రణ, సంస్కరణాభిలాష, నవలా నిర్వహణయందు లోటుపాట్లు మున్నగునవి స్థూలముగా సమీక్షింపబడును.

స్త్రీ పురుషుల సంబంధములను గూర్చి ఆమె అభిప్రాయములు నవలల రచనా కాలముల ననుసరించి పరిశీలింపవలసి యున్నది.

కృష్ణవేణి (రచనాకాలము- 1958) నవలలో కృష్ణవేణి మాధవ్ వివాహితుఁడని తెలియక స్నేహ మొనరించి, తెలిసిన పిమ్మట అతడి ప్రథమ వివాహ వైఫల్యమునకు చింతించి, అతడు కోరినవిధముగా దైవసన్నిధిలో వివాహమున కంగీకరించి వెళ్ళబోయినది. కాని స్నేహితురాలగు కాంత సలహావలన కృష్ణవేణి మాధవ్‌తో వెళ్ళక తల్లిదండ్రులు నిశ్చయించిన శ్యామసుందర్‌ను వివాహ మాడినది. ఈ నవల యందు రచయిత్రి స్త్రీ పురుషులు వ్యవస్థకు ధర్మములకు కట్టుబడి ఉండవలెనని అభిప్రాయ పడిరి.

అంధకారంలో (1971) పద్మ, కృష్ణారావు అన్యోన్యముగా జీవించెడి దంపతులు. వీరి స్నేహితుడు ప్రకాశము తన మనసులో పద్మపట్లగల కోరికను పద్మతో ఒకనాడు వెలిబుచ్చినాడు పద్మ ఈ విషయము భర్తతో చెప్పినది కృష్ణారావు ఆమెతో "నన్ను నమ్ము పద్మా. నేను స్వార్థపరుడ్ని కాను. నీకు ఆనందము కలిగిస్తే ఏమైనా ఇస్తాను ప్రకాశం నిన్నంత ప్రార్థించినా నీకు జాలి కలుగలేదా? ఆ నిర్భాగ్యుడి కోసం నీ హృదయం ఎప్పుడైనా స్పందిస్తే అతన్ని కరుణించు పద్మా (పుట. 432)

సన్నివేశమును పరిశీలించినచో భార్యాభర్తలలో ఏ ఒకరైనను ఇతరులచే ఆకర్షింపబడినచో వారు తమ ఇచ్ఛానుసారముగా కోరికలను తీర్చుకొని, మరల సంసారజీవనము సాగించవచ్చునని రచయిత్రి అభిప్రాయపడుచున్నట్లు స్పష్టమగుచున్నది ఈ అభిప్రాయము సమాజశ్రేయస్సున కెంతవరకు ఉపయోగించు ననెడి విషయము చర్చించునపుడు క్రిందిప్రశ్నలుత్పన్నమగుచున్నవి.

1. పరపురుషునితో కోరికలు తీర్చుకొని అతనివలన బిడ్డలను కనుచున్న భార్య యందు భర్తకుండు ప్రేమాభిమానము లెట్టివి?

2 భార్యకు నూతనప్రియునకు కలుగు బిడ్డకు, అంతకుముందు భార్యాభర్తలకున్న బిడ్డలకు నడుమ నెలకొనెడి సంబంధ బాంధవ్యములు నెట్టివి?

3 నూతన ప్రియునకు ఈ కుటుంబముతో నుండెడి సంపర్క మెట్టిది? ఈబిడ్డ యందు ప్రియురాలి యందు అతని కభిమాన ముండునా?

4. ఈబిడ్డకు సమాజములో లభించు గౌరవమెట్టిది?

5. సమాజములో క్రమశిక్షణారహితమైన ఈకుటుంబమునకుగల స్థానమెట్టిది? ఈ ప్రశ్నలకు జవాబు లిట్లుండును.

1 మనకుటుంబ వ్యవస్థలో పురుషుడు తనభార్యాపుత్రుల పోషణార్థమై నిరంతర మనేకపాట్లు పడుచుండును. ఈ ఇల్లూ, భార్యా, పిల్లలూ, నావారు అనెడి భావముతోడనే పురుషుడు శ్రమించుట- కుటుంబనిర్వాహణ భారము వహించుట జరుగుచున్నది. ఇచ్ఛానుసారముగా తాత్కాలిక వాంఛకు ప్రాధాన్యము నిచ్చి, మనోదౌర్బల్యముతో ఇతరులతోపోయెడు భార్యయందు భర్తకు ప్రేమాభిమానము లుండవు. ఉండు నని యూహించుట మిక్కిలి అసమంజసము. అట్టి నికృష్ట సమాజజీవితము ప్రాప్తించినచో పురుషుడు సంసార బంధమునుండి విముక్తుడై కేవలము కాముకుడుగా మారుననుటలో నాశ్చర్యము లేదు.

2 భార్యకు నూతనప్రియునితో కలుగు బిడ్డకు - అంతకు ముందటి పిల్లలతో సంబంధ బాంధవ్యములు సరిగా నుండవు ఈబిడ్డరాకతో కుటుంబములో శాంతి సౌఖ్యములు దూరమగుట సత్యము. కావున మిగిలిన పిల్లలలో ఈ బిడ్డలవలన తమకుటుంబములో శాంతిలోపించినదను అభిప్రాయము బలపడి - వారి లేత మనసులు క్షోభించును. ఇట్టి వాతావరణములో పెరిగిన పిల్లలు దొంగలుగా ఖూనీకోరులుగా తయారగుదురనుటలో నత్యుక్తి లేదు.

(తరువాయి 11 వ పేజీలో)

# నమ్మకము

శ్రీ కౌలవపల్లి జమదగ్నిశర్మ, ఎం.ఏ.



నమ్మక మెన్నఁడున్ నరుని
నాశ మొనర్పదు, నమ్మకమ్ము త
త్త్వమ్మున నీశ్వరుండెయగు
తత్సముఁడైన మహామహుండె తా
నమ్మును దీనికైన, భువ
నమ్మిది సర్వము వంచకమ్ముగా
నమ్మట యన్న తేలికగు
నా బహుజన్మల పూర్వపుణ్యమా॥

శిశువులు బ్రహ్మ సమానులె,
పశువులు నటులౌను సాధుపశువులెయైనన్
బ్రశమిత చింతాకులమై
విశదమతిఁజరింపవచ్చు విశ్వాసముతోన్॥

మన మెంత నమ్మగలిగిన
మనలను లోకమ్ము నంతమాత్ర మెనమ్మున్
మన మందలి కాలుష్యమె
మనలను నమ్మంగ నీదు మహి నెద్దానిన్॥

అకలుష చిత్తు లేదయిన
హాయిగ నమ్మి చరించి తత్ఫలం
బు కని సుఖంతు రెప్పుడును
పొందరు నష్టము సంశయాత్ములె
న్నక చరియింప కంతయును
నష్టము గాగ నశింతు రందుచే
వికల మనస్కులై మనుట
వీడెడి చేతయె మానవాళికిన్॥

కొందఱు నమ్మకంబునకు
గ్రుడ్డితనంబొక టంట గట్టిన
మ్మందగుగాని నిర్ణయము
మానుష బుద్ధి కృతంబటంచు మే
లందగఁ జేయుఁ జేయ దని
యాగ్రహ మూనుచు బుద్ధి భేదముం
బొందగఁజేసి నమ్మకము
పొల్లయి పోవగఁ జేయుటయ్యెడిన్॥

నమ్మట హేతు పూర్వకమ
నం జన దెన్నఁడు బుద్ధి తర్కజ
న్యమ్మె యనన్ బొసంగదు త
నం తన నమ్మక మేర్పడున్ జెడున్
నమ్మగు టుండవచ్చు దృఢ
వైఖరి నమ్మట యొకటి నమ్మకం
బిమ్మయి భేదముండ నగు
నిద్ది జనంబుల స్వానుభూతియా॥

గ్రుడ్డిదియంచుఁ బేరిడుచుఁ
గుంఠితమున్ బొనరించు కొన్ని నీ
వొడ్డును చేరు టెన్నఁడును
నుండదు కారణముండి లేకయే
యడ్డును లేని యట్టి దృఢ
మైనది నమ్మిక నిన్ను గట్టుకన్
దెడ్డును వోలెఁ జేర్చు నిది
తెన్ను తరింపగ నమ్మమోసఖా!

దేహము నావ నమ్మకము
తెడ్డగు లక్ష్యము వేదవేద్యమై
దేహము నందె స్వాత్మమయ
దీపముగా వెలుగొందు శంకరుం
డూహాలనన్ దరంగములు
నూరక పుట్టెడి సంశయంబె స
మ్మోహమయాబ్ధి దాటి కను
మోయి పరాత్పరు స్వాత్మరూపునిన్॥

శివుని ప్రతీకమేది యన
స్త్రీ స్తనమో మతి మేక పెంటికో
భవునిటఁ గొల్పు మన్న నుడిఁ
బట్టి దృఢమ్ముగ నమ్మికొల్చి సం
భవమగు సర్వసత్ఫలము
పాయక పొందిన ధన్యులుండి రా
శివుని స్వయంభువున్ గొలిచి
సిద్ధిని పొందని వారలుందురున్॥

తన విశ్వాసము గట్టి తాఁగను
శుభోదర్కంబు భావింపవెం
టనె సిద్ధింగను జన్మమియ్య దగుటన్
టాటోటు లేకుండ నె
ట్లని భావించిన నట్లె సిద్ధియగు నా
గాడన్ బనేముగ్న, దో
యనఁ బల్కన్ శివుఁ డేల నమ్మ విఁక న
న్నా! నమ్ము మమ్మాటికిన్॥

---

( 10 వ పేజీ తరువాయి )

3. నూతన ప్రియుడు ఈ కుటుంబము యొక్క సుఖసంతోషాదులలో సంబంధము పెట్టుకొనుట కిచ్చగింపడు. అంటే ప్రేమానురాగము లుండి, మనసున్న వ్యక్తి అయినను అతడి ప్రేమ అగ్ని సాక్షిగా పెండ్లాడిన భార్య యందు బిడ్డలయందు నుండును. వీరియం దుండదు.

4 ఈబిడ్డకు సమాజములో గౌరవ ముండదు. సమాజ అవహేళనకు గురి అయి పిన్నవయస్సు నందే మానసిక బాధకు లోను కావలసి వచ్చి - బ్రతుకు నరక మగును.

5. ఈ కుటుంబమునకు సమాజములో గౌరవము మృగ్యము

'అంధకారములో' పైని పేర్కొని నట్టి ఆలోచనలు రచయిత్రి పుస్తకములో వెలువరించుట కడుశోచనీయము. ఇవి సమాజశ్రేయస్సునకు భంగకరములై సమాజమును చెడుత్రోవలో నడిపించుటకు దోహద మొనరించు చున్నవి.

( సశేషము )

మార్గ పద్ధతి — ఆధునిక రచయితలు

# శ్రీనాథుడు

— డా॥ అయ్యగారి నరసింహమూర్తి ఎం. ఏ., పిహెచ్. డి.

ఏ జీవిత చరిత్రగాని కష్టసుఖముల పరివర్తనమే అయినా ఎదలను కదలించే శక్తి యే కొద్దిచరిత్రలకో ఉంటుంది. అట్టి స్పందనా శక్తిగలది శ్రీనాథుని చరిత్ర. ఆహేతువు చేతనే ఆ యితివృత్తాన్ని కావ్యవస్తువుగా స్వీకరించి నిర్వచనంగా హృద్యమైన పదములతో అనవద్యమైన పద్ధతిలో సందర్భోచితమైన పలుకుబడులతో సహృదయ హృదయంగమమైన రమణీయ శిల్పంగా శ్రీనాథుని చరితను తీర్చిదిద్దిన వారు ఆధునికులలో నొకరైన శ్రీ చల్లా నరసింహారావుగారు. 'పురాణ మిత్యేవ న సాధు సర్వం న చాపి కావ్యం నవ మిత్యవద్యమ్' అన్న కాళిదాసోక్తికి ఈ గ్రంథం సర్వవిధాల తగియున్నది.

ఆజన్మసిద్ధమైన దేదైనా సర్వ సాధారణంగా ఇంపుగా సొంపుగా ఉంటుంది. కనుకనే ప్రకృతి ప్రతి ఋతువుఁకూడ నయనాభిరామంగానే చూపఱులకు గోచరిస్తుంది. అదేరీతిగ అఱువదినాలుగు కళలలోను గణనీయమైన లలిత కళలు కూడ సహజంగా అలవడి నపుడే వ్యక్తీకరణలో రామణీయకత గోచరిస్తూ ఉంటుంది. ఈ విషయాన్ని శ్రీ నరసింహారావుగారీవిధంగా చెప్పారు.

'కవన మందు కవిత, గాయక
నాదమ్ము, పాలతిక్కన్నరూపు పూవురంగు;
నేలమీద పుట్టి నేర్చుకొనిన రాదు,
జన్మతోన యవ్వి జతగవచ్చు'

శ్రీ నరసింహారావుగారు గురుముఖతః కావ్యాలేమీ చదువక పోయినా పూర్వజన్మ సంచిత పుణ్యవిశేషంచేత, స్వయం కృషిచేత కథాకథనంలోనేమి పద్య రచనలోనేమి చేయి తిరిగిన వ్యక్తిలా కనబడతారు వీరికి గల సంస్కారం ఈ యొక్క గ్రంథం చదివినా ప్రస్ఫుటంగా గోచరిస్తుంది. వ్యక్తిరీత్యా వీరు వ్యాపార రంగంలో ఉన్నా, ప్రవృత్తి వలన కవితా వ్యవసాయం కూడ, సాగిస్తూ ఉభయ రంగాలలో సవ్యసాచిలా రాణిస్తున్నారు.

సార సాహిత్య సామ్రాజ్య సార్వభౌముడు, సాంద్ర సౌహార్ద సౌందర్య సౌమ్య సోముడునైన శ్రీనాథుని జీవిత చరిత్ర వెలుగు నీడల కలయిక రెడ్డిరాజుల ప్రాపకంలో శ్రీనాథుడెంత భోగాన్ని అనుభవించాడో అనంతర కాలంలో ముఖ్యంగా గజపతులకాలంలో అన్ని కడగండ్లు అనుభవించాడు. అసలు తెలుగు సాహితీ రంగంలోనే యిట్టి విలక్షణమైన కవి మఱియొకడు కనబడడన్నా అబ్బురపడ వలసిన పనిలేదు

ప్రజలను విశృంఖల వీరవిహారమునుండి మరల్చి, నీతిమంతము, వీర్యవంతము, నియమ సంయుతమునైన సచ్ఛీలము వలవడఁ జేయఁగల అమలోదాత్త మహామనీషులు కవివృషభులు అక్షర బ్రహ్మను కనగలిగినవారు, కనిపింపఁ జేయగల వారు లోకమున కవులొక్కరే. వీరి సృష్టి సత్య శివసుందరమైనది.

పాలక పాలితులకుఁగల సంబంధమవిచ్ఛిన్నమైనది. ఆ అవినాభావ సంబంధమును మఱింత సద్వినియోగ పఱుపనెప్పటికప్పుడు నవజీవములతో జాతిని జాగృత మొనరించు వైతాళికుఁడు కవి. ఈతడు తన మనోనేత్రముతో భూత భవిష్యద్వర్తమానముల నెఱింగి ఉచితమైన రీతిలో సంఘమును నడిపింప గలనేత. ఆకారణము చేతనే కవులు కేవలము ప్రజలకే కాక రాజ్యాంగ నిర్వాహకులైన పాలకులకు నేత్రముల వంటివారు.

అట్టి కవి వృషభులను నిరాదరణచేస్తే దేశానికి జాతికి కలుగు కష్టనష్టాలేవిధంగా ఉంటాయో సమాదరణ ద్వారా ఎంతటి సమున్నతస్థితి నందవచ్చునో శ్రీనాథుని చరిత్ర ద్వారా మనము తెలుసుకో వచ్చును కవి శ్రేయస్సే సంఘ శ్రేయస్సు సంఘ శ్రేయస్సే ఒడుదుడుకులు లేని పాలనకు ప్రథమసోపానము ఈ విషయాన్నే కవి యిలా చెప్పారు.

కవుల కెల్లరకును దృష్టి గలిగెనేని,
జ్ఞాన సంపన్నులౌదురు జనులుముందు
జ్ఞాన ఖనులున్న దేశము జయముపొందు
అనద మన్నిడు లాసత్య మరయలేరు.

సత్కవివాక్కు, విలుకాడు పట్టిన బాణము, పరహృద్భిదమై తలయూపింపవలెను అట్టి సత్కవి కవితా ప్రాశస్త్యమును గూర్చి రచయిత ఈవిధంగా చెబుతున్నారు.

వాని (కవి) గంటముదాన పదనుచనువ
హృదయగుహాలోనశ్రీశిఖ కదలి వెలుగు
దేవునకు నున్నదే యట్టి దివ్యపటిమ (240)
స్వామియనుచు నుంట స్వర్గలోకములోన
స్వామి నెనడు దింపి వసుధ నిలుపు
గంటమందు కొన్న కవికె సాధ్యమనియ, (95)

అనీ కవి ప్రతిన. దానికి కారణ మిది. కవి 'తప మొనరించి మంజుల పదమ్ముల నాదము సృష్టిచేసి దివ్య పథమును' జూపును కనుకనే సుకవి చరయించు నీడలో శోభ యుంటుంది అట్టి కవుల కావ్యములను

విలువ తెలిసి చదువ విడబారు మనమంత
విడిన మనము మీద వెలుగు కవిత
కవిత వెలిగినంత కాంతితో బ్రతికుండు
కాంతి యున్నయపుడె క్రాంతి కలుగు
(15)

అందుచేత అట్టి కవిశేఖరులను ఎల్లప్పుడు ప్రజలు పాలకులు కూడ నిరాదరణ చేయక సమాదరణ చూపుతూ ఉండాలి.

కవులు దేశానికి కన్నులవంటి వారు. అట్టి కన్నుల నలక్ష్యం చేయడం జాతికి శ్రేయోదాయకమైన పనికాదు.

ధనము కలిగియున్న ధైర్యమ్ము కవికుండు
ధైర్యమున్న ప్రజకు దారిచూపు
కవులుచూపుదారి కలకాల సౌఖ్యమ్ము,
కవులుదేశమునకు కనులునిజము. (117)

మంత్రి యుక్తాయుక్త విచక్షణా జ్ఞానం లేని హీనుడైతే దేశంలో ఏరంగంలోనైనా ఏవ్యక్తి ప్రతిభా ప్రాభవాలైనా అడవిని గాచిన వెన్నెలవలె, బూడిదలో పోసిన పన్నీరువలె నిరుపయోగమైపోతాయి అంగడిలో అన్నీ ఉన్నా అల్లుని నోట్లో శని ఉందంటే యిట్టి సచివోత్తముల చిత్తప్రవృత్తి వలననే. దాన్ని గ్రంథకర్త యీ విధంగా చెబుతున్నారు.

'సాహితీ శోభ గుర్తించు సచివుడున్న
కవికి కష్టాలు కంటికి కానబడవు
కవిక కష్టమున్న ప్రజకు శాంతిలేదు
కనుక నట్టిమంత్రి మనము కాంచవలయు'
(116)

'నేలబట్టి చెరువునీరు నెగడియుండు
మంత్రి బట్టి ప్రభుత మనుచు నుండు'

మంచి చెడ్డలేక మంత్రి నెన్నుకొనిన ఆ ప్రజల పాట్లు కుక్కల పాట్ల కంటె కనా కష్టంగా ఉంటా యనడంలో సందేహం లేదు.

ఏ నేత బుద్ధికష్టంలోని, కాయకష్టంలోని ఘనతను గుర్తింపడో అక్కడే నరకం ప్రజలకు కనబడుతుంది.

బుద్ధికష్టమైన బాగ రేగి తనువెండు
కాయకష్టమైన కండ పెరుగు
కష్టయుగమునందు ఘనమెంచిచూచెడి
నేత కలుగ దేని నిరయ మదియ ( 05)

గజపతుల కాలంలో బుద్ధివైభవానికి ప్రాభవం లేకపోవడంతో శ్రీనాథుడు పడరాని పాట్లుపడినాడు. నేడీ భారతావనిలో అట్టి శ్రీనాథులు కేవల కవితారంగంలోనే కాక అన్ని రంగాలలోను వందలు వేలు కనబడతారు.

దివిలో తారకలున్నంతకాలం భువిలో మానవు లెవరైనా తమ పేరు నిలవాలని యనుకుంటే వారు తప్పకుండ కవుల నాశ్రయించాలి. వాల్మీకి కవి వృషభమే లేకుంటే సాక్షాద్విష్ణ్వంశ సంభూతుడైన ఆ రాముని నామ మీలోకాని కెరుకపడేదే కాదుకదా! అందుకనే కవి యెల్లరకును సమాదరణీయుడగుచున్నాడు ఆవిషయాన్ని 'శ్రీనాథుడు' కృతికర్త యిలా వివరించారు.

భువిపయి పుట్టి పాలితుల
భోగ్యులఁ జేసి గతించునట్టి క్షో
ణివరుల యూరు పేరు లిట
నేలను బూడెను వారితోనె యా
శివుడును చెప్ప లేక్కడిపుడు
చెల్లిన వాడల దేశసేవస
త్కవుల కరాల నందుకొను గంటముతే
యిహాముక్తి నిచ్చెడిన్

చెప్పేవారిలో నేర్పు, చెప్పించుకొనే వారిలో ఓర్పు, ప్రాజ్ఞత ఉన్నపుడె ఏకార్యమైనా రాణింపుకు వస్తుంది.

పదము పదము కలియ భావమ్మునినదించు
నినదమందు రవము నేర్వవలయు
నేర్వలేని జడులు నిర్ణేతలైయున్న
పైకిరావు పరులభవ్యకృతులు (52)

'వజ్రం వజ్రేన భిద్యతే' అన్నట్లు పరీక్షించు వ్యక్తి ప్రాజ్ఞుడైనంత మాత్రాన సరిపోదు. రాగద్వేష రహితుడై మంచి చెడ్డలను నిర్భయంగా వ్యక్తం చేయగల నేర్పుగలవాడై యుండాలి.

శక్తిమంతమైన కవిత్వం కావాలంటే అది అనాయాసంగా లభించేది కాదు. కనుకనే ఆంధ్రకవితా పితామహుడైన అల్లసాని పెద్దన సత్కావ్య రచన కుద్యుక్తుడు కాగోరిన కవి వరేణ్యునకు పలువిధములైన సామగ్రితో పాటు నిర్వికల్పమైన వాతావరణం ఉండాలని నిస్సంకోచంగా 'నిరుపహతి స్థలంబు' అన్న పద్యంలో వ్యక్తం చేశాడు రాయలును గుణగ్రహణ పారీణుఁడు గనుకనే కినుక వహింపకుండ కోరినవెల్ల మారుమాటాడక యిచ్చి ఓమంచి కావ్యాన్ని లోకానికి అందించాడు తాను చరితార్థుడైనాడు. ప్రజలను చిన్మయంలో మునక్కలు వేయిస్తున్నాడు

గురు లఘువులతో కూడిన పదముల కూర్పే పద్యం కాబోదు. బలవంతంగా వ్రాసే కవిత ఏరీతిగా పర్యవసిస్తుందో ఈకృతికర్త చక్కగా చెప్పారు.

కచ్చ వెనుకదోపి గంటమ్ము బరుకంగ
పత్రమంత విరుగు పనికిరాక
పడతిని తొడగొట్టి పడగొట్టు వానికి
కావ్యకన్య యెట్లు కరమునిచ్చు (58)

కనుక త్రికాలా బాధితమై జగతికి మేలు కూర్చే కృతిని రచించడం మాటలతో అయ్యేపని కాదు.

యథార్థమైన కళాపాటవము, తృష్ణ కలిగినవ్యక్తి మానస మేరీతిగాఉంటుందో యీ క్రింది పద్యాన్ని బట్టి తెలుసుకోవచ్చును.

పొట్టయాకలి కెవ్వరు బాగులరింత
మనసు ఆకలికోసమే మథనపడుమ
సార సారస్వతా సార కార సురభి
తనివితీర త్రాగుకొలఁకె త్రాగుచుంద్రు
(2)

అయితే ఇట్టి వ్యక్తులకు తరుణంలో తగిన అండదండలు లభించడ మనేది చాల అరుదైన విషయ మని మనకు చరిత్ర నేర్పుతున్న పాఠం.

నాడు_నేడు పరపాలనలో మనమేమో చాల కష్టనష్టాలకు గురియైనామని స్వాతంత్ర్యానికిపూర్వం భ్రాంతి పడ్డాము. పిల్లకాకి కంటె తల్లికాకి మేలన్నట్లుగా స్వరాజ్య పాలనలో అక్క-

(తరువాయి 14 వ పేజీలో)

# ప్రాచీన కవులకు సామాజిక స్పృహలేదా ?

— శ్రీ మోపిదేవి కృష్ణదేవి, ఎం. ఏ



పూర్వసాహిత్యమున సామాజికతకు చోటులేదనియు, సామాజిక స్పృహ వారికి అంతగా లేదనియు, అందువలననే నాటిసమాజము స్థితిగతులుఆసాహిత్యము వలన ప్రతిఫలింపలేదనియు కొందరను చున్నారు. రామాయణ భారతముల విషయమున ఈ వాదము సత్యదూరము. వారుఅనగా వాల్మీకివ్యాసులు నాటిసమాజమున జరిగినకథలను ఆధారముగాగొని సార్వకాలికము, సార్వజనీనము అయిన సనాతన ధర్మములను లోకమునకు ఉపదేశించినారు. వారివలె సమాజమున జరుగుచున్న సన్నివేశములను ఆధారముగాగొని రమణీయమగు రచన చేసి లోకమునకు అందించవలెనన్నచో మన మెంతటి తపస్సు చేయవలసియున్నదో ఎవరికివారు నిర్ణయించుకొనవలసియున్నది తరువాతి కవులు రామాయణ, మహాభారత అష్టాదశపురాణము లందలి అంశములనే ఆధారముగాగొని జనరంజకములగు కావ్యములను రచించినారు వీరి కావ్యములలో పురాణేతిహాసములకు ఉన్నంత ప్రాధాన్యము వారి నాటి సాంఘిక జీవనమునకు, సామాజికుని స్థితిగతులకును లేదని ఒక వాదము.

రచయితలు రెండు తరగతులుగా నుందురు మొదటి తరగతివారు సమాజమును గూర్చి వ్రాయుదురు. రెండవతరగతి వారు సమాజముకొరకు వ్రాయుదురు మొదటితరగతివారు సమాజమెట్లున్నదో వర్ణింతురు. రెండవతరగతివారు సమాజమెట్లుండవలెనో సూచింతురు. మొదటి తరగతివారు సమాజపు తీరుతెన్నులను జాగ్రత్తగా కెమెరాతో ఫోటోతీసినట్లు రచన చేయ ప్రయత్నింతురు రెండోతరగతివారు తమకలము అనుకంచెతో సామాజిక చిత్రమును తీర్చిదిద్దుటకు ప్రయత్నింతురు నన్నయాదులైన పూర్వపుకవులు ఈ రెండవతరగతికి చెందినవారు. వారు తమనాటిసమాజము తమరచనలలో ప్రతిఫలించితీరవలెనని కోరుకొనలేదు. తమ రచనలు తమ సమాజము ఉద్ధరింపబడుటకు ఉపకరణములు కావలెనని వాంఛించి జగద్ధితమునకై రచనలు చేయుచున్నామని చెప్పినారు సామాన్యునగు లోకము తనకు దారిచూపురచనలను ఆశ్రయించునుగాని తన తీరుతెన్నులను తెలుపు రచనలను అంతగా పట్టించుకొనదు. దారి చూపు రచనలను ఆరాధించును తీరుతెన్నులు తెలుపు కావ్యములను కాలక్షేపమునకు ఉపయోగించుకొందురు. కనుకనే ఈరోజునకూడ రామాయణ, భారత భాగవతాది పవిత్ర గ్రంథములకు ప్రజలలోనున్న ప్రాచుర్యము,ఆదరణ, మరియే యితర కావ్యమునకు లేదు. ఇది ప్రజల గుడ్డితనమనుట హద్దుల నతిక్రమించి వారని నిదించుట యగును.మనకు కనిపించినదే సత్యమనుకొనరాదుగదా! సత్యము కనిపించునటులు మనను మనము తీర్చిదిద్దుకొనవలసి యుండును

మన రచలనయందు మన నాటి సమాజము ఎంతవరకు ప్రతిఫలించినదని చూచుకొనుటకన్న మనరచనలు మన సమాజపు టభ్యున్నతికి ఎంతవరకు దోహదము చేయుచున్నవో చూచుకొనుచుండుట సరైనరచయిత ధర్మము. మనకష్టసుఖములనుగూర్చి పదేపదే వర్ణించు వారికన్న మన కష్టసుఖములపై సానుభూతిచూపు వారు మిన్న సానుభూతి చూపువారికన్న మనకష్టములనుండి మనముబయటపడుమార్గముచూపగలవాడు మిన్న. సమస్యలను ఎత్తిచూపిన సమాజము ప్రతిబింబించినది అని అనుకొనటకన్న ఆ సమస్యల కడతేరు సమన్వయము చూపి జాతికి చేయూత నిచ్చుట ధర్మము. ఆ సమన్వయము నేడు కనుగొనినది కావచ్చును పూర్వమే పెద్దలు దర్శించి ఈయబడినదై యుండవచ్చు. ఒకనికి జబ్బు చేసినచో నేడు కనుగొనిన ఔషధముతోనే ఆజబ్బు నయము కావలెనని యుండదుకదా! పూర్వముఎప్పుడో పెద్దలుకనుగొనిన ఔషధములసాయమున వైద్యుడు నేటి జబ్బునుండి ఉపశమింప జేయుట చూచుచున్నాము కదా! నన్నయాదు లట్టి ఘనవైద్యులు వ్యాసుడు దర్శించి యిచ్చిన ధర్మాద్వైతస్థితిని ఔషధముగా గొని తమ నాటి సమాజమునకు తెనుగు భాషను అనుపానముగాచేసి అందించిరి. అట్లే, రచయిత సామాజికమైన లోటు పాట్లనువర్ణించు వాడుకాక, ఎత్తిచూపు వాడుకాక ఆలోటుపాట్లను సరిదిద్దుటకు తగినఔషధమును ప్రసాదింపగలవాడు కావలెను ఇది నన్నయాదులు మనకు చూపుచున్న మార్గము

---

( 13 వ పేజీ తరువాయి )

రలు తీరకపోగా ఇక్కట్లకు అలవాటు పడవలసి వస్తోంది.

రెడ్డిరాజులకాలంలో 'మనసు నభిషేక మొనరించి మమతగొల్పు సౌమ్య సౌలభ్య సౌందర్య సౌఖ్య కళ' లన్నియు గజపతుల కాలంలో అడుగంటి వేసవినడుమ నదు లున్న విధమైనవి. రెడ్డి రాజులోకరొకరే కాలవాహినిలో కలసిపోయారు. సరియైన నేతలేక ప్రజలలో నైకమత్యము క్రమక్రమముగా క్షీణించడం చేత ఆంధ్రరాజ్యరమ ఓఢ్రప్రభువుల కైవసమైంది.

# ఆనంద గజపతి - సమస్యాపూరణము

— సాహిత్యకోవిద శ్రీ త్రోవ్విడి రామం, బి.ఏ, బి యల్, బి ఇడి

అవి పందొమ్మిదవ శతాబ్దపు చివరి రోజులు మోతీమహల్ సరస్వతీమహాల్ గా పరిణమించినరోజులవి తుంగభద్ర దరిని, విజయనగరంలో భువనవిజయాన్ని అధిష్ఠించిన అష్టదిగ్గజాలలాగే కళింగదేశంలో గల విజయనగరసంస్థానాస్థానంలో కూడ భగవత్కవి ముడుంబై నరసింహాచార్యుల వారు, సాహిత్య చక్రవర్తి కొల్లూరు శ్రీరామశాస్త్రి గారు, భాష్యాంత వైయాకరణి పేరి కాశీనాథశాస్త్రి గారు నవయుగ వైతాళికులు గురజాడ అప్పారావు పంతులుగారు మొదలైన మహా వదాన్యులు, కవితావతంసులు ఎంతమందో వుండేవారు. ఆశుకవిత, సమస్యాపూరణం, సూరిజనమనోరంజకంగా, తరచు అక్కడ ప్రదర్శిత మౌతూవుండేవి

ఒకనాటి సభలో విద్వద్రాజశిఖామణులైన శ్రీ ఆనందగజపతి మహారాజావారు "సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్" అనే కందపద్యపాదాన్ని సమస్యగా ఇచ్చేరు పుంఖాను పుంఖాలుగా సమస్యాపూరణాలు రాజసభని చకితం చేసేయి -. సమస్యను పూరిస్తూ "సత్యవ్రతి" శతకం అనే పేరుతో శతకాలు వ్రాయవలసిన దనిన్నీ, ఉత్తమరచనకు తగినపారితోషికం లభించగల దనిన్నీ, ప్రభువులు పండితకవులను ఆదేశించేరు. ఎన్నో శతకాలు ఆరోజులలో రచించబడ్డాయి దురదృష్టవశాత్తు ఉత్తమ శ్రేణికి చెందిన శతకాన్ని ఎన్నికచేయక పూర్వమే, ఆనందగజపతి దివంగతు లవడంచేత, యీ ఉద్యమం అలా చల్లారిపోయింది.

అయినప్పటికీ, అప్పుడు శతకాల్ని రచించిన కొంతమంది విద్వాంసులరచనలు తరువాత అచ్చుపడ్డాయి. శ్రీ పంతుల బ్రహ్మన్నశాస్త్రిగారు, శ్రీ నిడదవోలు సుందరంపంతులుగారు మొదలైన వారు రచించిన శతకాలను గురించి యీప్రాంతంలో సంస్కృతిపరులు కథలుగా గాథలుగా చెప్పుకుంటూరు "ఆరవయింట త" కారం కలిగినయీసమస్యను ఇచ్చినవారో లేక పూరించినవారో పృథ్విపైఆట్టేకాలం వుండరని బ్రహ్మన్న కవిగారు చెప్పేవారట-అచ్చుపడి ప్రచారంలో వున్న శతకాలలో శ్రీ ఆదిభట్ల నారాయణదాసు గారిశతకం, శ్రీ భాగవతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారి సత్యవ్రతిశతకం ప్రచారంలో వున్నాయి - ఆనాటి ఆనందగజపతి దర్బారులో ప్రచురితమైన సాహిత్య ప్రతిభను స్థాలీపులాకన్యాయంగా నిరూపించడానికి భాగవతులవారి సత్యవ్రతి శతకాన్ని గురించి నాలుగుమాటలు మనవి చేస్తాను.

ఈ శతకం 1889 వ సంవత్సర ప్రాంతంలో రచింపబడింది - నలభై సంవత్సరాల తరువాత 1929 వ సంవత్సరం మార్చినెలలో శ్రీ భాగవతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారి కుమారుడైన శ్రీ లింగమూర్తిగారు, విజయనగరం శ్రీ రామానుజ విలాస ముద్రాక్షరశాలలో ఈ సత్యవ్రతి శతకాన్ని అచ్చువేయించేరు శ్రీ భాగవతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు, విజయనగర మహారాజ కళాశాలలో సంస్కృత పండితులుగా వుండేవారు - సంక్షిప్త రామచరితమ్, శ్రీ రామవిజయం మొదలైన సంస్కృత గ్రంధాలువీరి యితరరచనలు.

పండితమాన్య సైక వేద్యంగా వుండాలనే సంకల్పంతో యీజటిలమైన రచనను చేసేరుగనుక, యథార్థంగా టిప్పణి కూడా కవిగారే ప్రతిపద్యానికీ చేర్చి, ఆ-చ-లోని నిగూఢ విషయాలను చదువరులకు పరిచయంచేసేరు

మయూరుని సూర్యశతకంలాగే, యీ సత్యవ్రతిశతకంకూడ కావ్యంగనక, మంగళాదిని మంగళమధ్యాని, మంగళాంతాని, అనే కావ్య సంప్రదాయాన్ని, యీ రచయితకూడాఅవలంబించేరు ఆశీర్నమస్క్రియావస్తు నిర్దేశాలలో దేనితోనో ఒకదానితో కావ్యాన్ని ప్రారంభించవలసి వుంది. అందుచేతవీరు కూడా,

"శ్రిత జనరక్షణ నిత్య
వ్రత దీక్షాతత్పరులగు వారాహీ శ్రీ
పతి వాణీపతుల కృపన్
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్"

అనేపద్యంతో శతకాన్ని ప్రారంభించేరు-"శ్రితజనరక్షణ తత్పరులైన బ్రహ్మ విష్ణు, మహేశ్వరుల కృపచేత, సత్యవ్రతునకు ఎల్లప్పుడూ సంతస మొప్పొంగుగాక, అనే ఆశీస్సులతోపాటు, కృతినాయకుని యొక్క సత్యవ్రతిత్వరూపం, సామాన్య ధర్మంచేత నిరూపింపబడినది. గనుక ఇక్కడ, "పర్యాయోక్త" అలంకారం వ్యక్తమవుతున్నదని శ్రీ శాస్త్రిగారు టిప్పణితో వివరించేరు. శ్రీకారంతో రచనప్రారంభించడం ధర్మమే అయినా, యీ సమస్య ననుసరించి అలాంటి అవకాశం లేకపోవడంచేత, "శ్రితజన" అని కావ్యాన్ని ప్రారంభించేరు - "సత్యప్రశంస" మంగళానికే మంగళం చేకూర్చేదిగా వుటుందిగనుక, వర్ణగణాది శుద్ధిని గురించి అంత పట్టించుకో నక్కరలే దంటూరు కవిగారు

ఇంతేకాకుండా, "మరియును సమస్యాంతంబగు" సత్యవ్రతి" అనుచోటున "నకర్మధారయాన్మత్వర్థీయో బహువ్రీహిశ్చేత్ తదర్థప్రతిపత్తేః"అను భాష్యకార వచనమునుబట్టి దూషణోద్ఘాటనంబు, కృష్ణసర్పవాన్ వల్మీకః అను భాష్యకార ప్రయోగమునుబట్టి శశవిషాణ కల్పంబని యెరుగునది కావున సర్వము అనపద్యము" అని శ్రీ లక్ష్మీనారాయణ శాస్త్రిగారు తమ టిప్పణి ప్రారంభదశలో వివరించేరు.

---

# ఈ పక్షంలో

## 'వ్యాస భారతము - నన్నయ పరిష్కారము

### గ్రంథావిష్కార మహోత్సవము

స్థానిక వీరేశలింగ పురమందిరములో 1-8-1979 ఉదయము 10 గంటలకు 'వ్యాస భారతము నన్నయ పరిష్కారము' ను డాక్టర్ శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు గారు, ఎం, ఏ., పి హెచ్ డి. చించిన గ్రంథమును ప్రముఖ సాహిత్య త్త ఆంధ్ర విశ్వకళా పరిషదాంధ్ర షా శాఖాధ్యక్షులు ఆచార్య డాక్టర్ స్వీజోగారావు, ఎం ఏ, పి హెచ్.డి. రు ఆవిష్కరించినారు.

సభకు మాజీ పురపాలక సంఘాధ్య లు, మాజీ శాసన సభ్యులు పుర మం సమాజాధ్యక్షులు శ్రీ పోతుల వీరభద్రరావుగారు అధ్యక్షత వహించిరి

శ్రీ చేబోలం శ్రీరామచంద్రమూర్తి ార్థనతో సభ ప్రారంభింపబడినది. రమందిర ధర్మకర్తృత్వ సమితి కార్య ర్శి శ్రీ వై. ఎస్ నరసింహారావు రచ యితృ దంపతులను, అతిథులను వేదిక కి ఆహ్వానించారు. శ్రీ గాదేపల్లి క్కటేశ్వరరావు గారు ముఖ్యాతిథు ను పరిచయము చేసిరి. శ్రీ గంధి సుబ్ర హ్మణ్యముగారు వేదికపై ఆసీనులయిన రి నందఱను పుష్పమాలాలంకృతు ను గావించినారు.

విద్యాభూషణ ఆచార్య శ్రీ దామెర్ల కట రావుగారు ఆశీర్వదించినారు. హాకవి శ్రీ మధునాపంతుల సత్యనారా ణ శాస్త్రిగారు సాహితీ క్షేత్రములో ఒక గొప్ప కృషి వలుడని వారి నాశీర్వదించినారు.

గ్రంథమును ఆవిష్కరించుచు డా॥ ఎస్వీజోగారావుగారు 'వ్యాస భారతము - నన్నయ పరిష్కారము' అను ఈ గ్రంథము వ్యాసనన్నయ భారతముల నడుమ నిర్మింపబడిన సాహితీ సౌహార్ద సేతువని, దానికి మార్గదర్శకత్వము వహించుట తన అదృష్టమని, భారత సముద్రము నండి డా॥ జొన్నలగడ్డ ఎన్నో ఆణిముత్యాలను మంచి పట్టుదలతో, నేర్పుతో వెలికిదీసి రనీ అన్నారు.

పోతుల వీరభద్రరావుగారు తమ అధ్యక్షోపన్యాసంలో నన్నయ భారతము రచించిన రాణ్మహేంద్రవరములోనే తద్గ్రంథ ప్రాశస్త్యమును వివరించుచు రాణ్మహేంద్ర వాసియే యైన డా॥ జొన్నలగడ్డ రచించిన పరిశోధన గ్రంథము ఆవిష్కరింప బడుట అత్యంతము సముచిత మన్నారు ఈ గ్రంథము విద్యార్థులకే కాక పండితులకు సైతము మార్గదర్శకముగా ఉన్న దన్నారు.

భీమవరం నన్నయ విద్యాపీఠాధ్యక్షులు, డాక్టర్ పెనుమత్స వేంకటరాజు గారు నన్నయ భారతమును సమంచితముగా పరిశోధనచేసి ఎన్నో నూతన విషయాలు చెప్పిన డా॥ జొన్నలగడ్డ మిక్కిలి ప్రశంసనీయుడని పలికి వారికి సర్వ విద్వ దామోద ముద్రతో 'భారతాచార్య' అను బిరుదమును ప్రకటించినారు

మహా విద్వత్కవులు శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు ఈ పరిశోధన గ్రంథము పరిపూర్ణమై పురివిప్పి యాడు నెమలివలె భాసిల్లుచున్న దన్నారు.

ప్రముఖ సాహితీ విమర్శకులు శ్రీ మల్లంపల్లి శరభేశ్వరశర్మగారు కొండ వంటి వ్యాసభారతమును కోవెలవలె మార్చిన మహాశిల్పి నన్నయయని, ఆ నన్నయ శిల్పవైదుష్యమును ఈ గ్రంథము కూలంకషముగా ప్రకటించుచున్నదని, పరిశోధనల విషయమున తనకు ఈ గ్రంథము తృప్తి కల్గించినదని, ఒక పరిషత్తు చేయదగిన మహాకార్యమును శ్రీ మృత్యుంజయరావుగారు ఒక్క చేతి మీదుగా చేసిరని ఈ గ్రంథమునకు స్వర్ణ పదకమిచ్చి గౌరవించుట ద్వారమున ఆంధ్ర విశ్వవిద్యాలయము వారు ప్రశంసనీయులని ఉద్ఘాటించినారు

ప్రభుత్వ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ ఆర్ యస్ సుదర్శనం తమప్రసంగములో శ్రీ మృత్యుంజయ రావు ఈ గ్రంథము ద్వారమున సాహిత్యమునకు గొప్ప సేవ చేసిరని అన్నారు

శ్రీ చేబోలు చిన్మయ బ్రహ్మకవి, ఎస్. రామాచారి, గ్రంథ ప్రాశస్త్యమును వివరించుచు ప్రసంగించిరి శ్రీ ధవళ నరసింహ శర్మ శ్రీ జొన్నలగడ్డ ఎంతో పరిశ్రమ చేసి రచించిన యీ గ్రంథము ప్రతి గ్రంథాలయములోను ఉండదగిన దని అన్నారు శ్రీ నిమ్మలపూడి వీర్రాజు తెలుగును ప్రోత్సహించవలసిన అవసరమును వివరించిరి

గ్రంథకర్త శ్రీ మృత్యుంజయ రావు గారు తొలుత కృతిభర్త శ్రీ వేణుగోపాల స్వామి వారికి, భారతకర్త నన్నయకు జోహారు లర్పించి, తన్నావిధముగా సత్కరించిన రాజమహేంద్ర పురవాసులకు ఛందోరూపములో తమ కృతజ్ఞత తెలిపినారు. తన ద్వారమున శ్రీ నన్నయనే వారు సత్కరించినట్లు తాను భావించుచున్నానని పలికినారు. తనకు

డా॥ నారపరాజు శ్రీ[illegible]
(M.B. B.S. D.T.M. [illegible])

ఘన సమ్మానము చేసిన శ్రీ గ్రంథి సుబ్రహ్మణ్యము గారి ఔదార్యమును కొనియాడి గ్రంథకర్త వారిని ఆశీర్వదించినారు. తమ గ్రంథము విషయమున ఎవరికైనను అభిప్రాయ భేదమున్నచో దానికి 'లోకోభిన్నరుచిః' యన్నదే తమ సమాధాన మని గ్రంథకర్త అన్నారు.

వేదాశీస్సులు జరగుచుండగా శ్రీ గ్రంథి సుబ్రహ్మణ్య దంపతులు గ్రంథకర్త దంపతులకు నూతన పట్టవస్త్రములు సమర్పించి, గ్రంథకర్తను రు 116 లతో దుశ్శాలువతో సత్కరించినారు. శ్రీ సుబ్రహ్మణ్యముగారు వేదికపై నాసీనులైన వారి నందఱను శాలువలతో సత్కరించినారు. గ్రంథకర్త తనయుడు శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణ తల్లిదండ్రులకు నూతన వస్త్రములు సమర్పించి పూజ గావించి, శ్రీ యస్వీజోగారావుగారిని నూతన వస్త్రములతో సత్కరించెను.

సభా ప్రారంభమునకు ముందు గ్రంథకర్త దంపతులు శకుంతలా మృత్యుంజయ రావులను వారి గృహమునుండి పురమందిరము వఱకు మయూరాకారముగా నలంకరింపబడిన పుష్ప రథములో మేళ తాళములతో నూరేగించి తీసికొని వచ్చినారు.

దీనికి ముందటి దినమున 10-8-1979 ఉదయము స్థానిక శ్రీ వేణుగోపాల స్వామి ఆలయములో శ్రీ స్వామి వారికి గ్రంథకర్త మృత్యుంజయరావు గారు పత్నీ సమేతముగా, గ్రంథి సుబ్రహ్మణ్య దంపతుల సహకారముతో గ్రంథమును పూజా పురస్సరముగా, శాస్త్రోక్తముగా అంకితము గావించినారు.

—...—


## 1979-80 బి. వి. అండ్ కో., వారి ప్రచురణములు

**Telugu Five Pandits Notes**
**Intermediate**

| | | |
|---|---|---|
| I Year | గద్యభాగము నోట్సు | రు. 6 - 50 |
| ,, | ఉపవాచకము నరమేధము నోట్సు | రు. 3 - 00 |
| II Year | పద్యభాగము నోట్సు | రు. 8 - 50 |
| ,, | నాటకము అశ్వత్థామ నోట్సు | రు. 3 - 00 |

**ENGLISH**

| | | |
|---|---|---|
| I Year | English Notes (Prose & Poetry) | రు. 7 - 50 |
| ,, | Select short stories (Nondetailed) | రు. 1 - 50 |
| II Year | English Notes (Prose & Poetry) | రు. 6 - 75 |
| ,, | Tales from Home and Abroad (Nondetailed) | రు. 1 - 50 |

**డిగ్రీ తరగతులు**

| | |
|---|---|
| B. Com. II Year Telugu Notes (Old Poetry with text) | రు. 7 - 00 |
| B. A. II Year Telugu Notes (Old Poetry with text) | రు. 7 - 00 |

* * పై రెండును వారమురోజులలో వెలువడుచున్నవి.

| | | |
|---|---|---|
| ప్రతిమ | B. Com. II Year నాటకము నోట్సు | రు. 3 - 00 |
| బలరామ విజయము | ,, | రు. 3 - 00 |
| స్వప్నవాసవదత్తము, సుభద్ర | B.A. II Year నాటకమునోట్సు | రు. 6 - 00 |

For Copies :—
B. V. & CO., 6-8-7. Tyagaraja Nagar, Rajahmundry.

